# Andhra University

PART II

# TELUGU TEXT

## INTERMEDIATE EXAMINATION

## 1931-32.

# ఉత్తరరాఘవము.

## ఎనిమిదంకముల నాటకము.

మహాకవి భవభూతి యుత్తరరామచరిత నాటకము ననుసరించి

సత్యహరిశ్చంద్రీయ సాత్రాజితీయాది నాటక

గ్రంథకర్తయగు


## బలిజేపల్లి లక్ష్మీకాంతకవిచే


రచియింపఁబడినది.


THIRD EDITION 2000 COPIES
THOROUGHLY REVISED

PRINTED BY M. VEERABHADRA RAO
AT THE
RAMA KRISHNA PRINTING WORKS, TENALI.

1930.




Price Re. 1—4—0] [వెల రు. 1—4—0

# నాటక పాత్రములు.

## పురుషులు.

శ్రీరాముఁడు — కథానాయకుఁడు
కంచుకి — రామాంతఃపురవర్తి
అష్టావక్రుఁడు — ఒకఋషి
లక్ష్మణుఁడు — కథానాయకుని తమ్ముఁడు
దుర్ముఖుఁడు — చారుఁడు
వాల్మీకి — కుశలవులఁ బెంచిన ఋషి
శంబూకుఁడు — శూద్రతపస్వి
కుశలవులు — రాముని పుత్త్రులు
గాలవుఁడు — కుశలవుల సహాధ్యాయి
జనకుఁడు — సీత తండ్రి
ధృష్టి — జనకుని కంచుకి
పురుషుఁడు — గుఱ్ఱపుదండులోనివాఁడు
చంద్రకేతుఁడు — లక్ష్మణునికొడుకు
సుమంత్రుఁడు — ఆతనిసారథి

మఱికొందఱు వటువులు వత్తురు.

## స్త్రీలు.

సీత — కథానాయిక
వాసంతి — జనస్థాన వనదేవత
ఆత్రేయి — తపస్విని
లోపాముద్ర — అగస్త్యుని పత్ని
మురళ — పంచవటియందు సీతననుసరించిన మునికన్య
అరుంధతి — వసిష్ఠ పత్ని
కౌసల్య — రామ జనని
పృథ్వి — సీత జనని
భాగీరథి — సీతకుఁ బురుడువోసినది, గంగాదేవి

---

ప్రదర్శనము ముగ్గురు నలుగురు స్త్రీ పాత్రములతో సర్దుకొన వచ్చును.

# ఉపోద్ఘాతము.



శ్లో॥ జయంతి తే సుకృతినో, రససిద్ధాః కవీశ్వరాః

నాస్తి తేషాం యశఃకాయే, జరామరణజం భయం॥

సహృదయులారా!

ఎన్నఁడో జన్మించిరి. ఎన్నఁడో పాంచభౌతిక శరీరములఁ బరిత్యజించిరి. కాని జ్యోతిర్మయమూర్తులై, యనంతాకాశపీఠమున ఆనందసామ్రాజ్య పట్టభద్రులై, యత్యున్నత భారతీయ కవితాకళాకాంతులతోఁ బంచఖండాంతర విశాల వసుంధరావలయ మెల్ల నేఁటికిని-కాదు ఆకల్పాంతము వెలయించు మహాకవులు కాళిదాసభవభూతులు ధన్యులుగదా! వారిలోఁ గవికులగురువు కాళిదాసు వాఙ్మయ ప్రపంచమునకు "శాకుంతలము" అను చింతారత్నమును బ్రసాదించినాఁడు. మహాకవి భవభూతి "ఉత్తరరామచరితనాటకము" అను దివ్యామృతస్రవంతిని బ్రవహింపఁజేసినాఁడు. ఆ యమృతస్రవంతిలోని పిల్లకాలువయే నా యీ "ఉత్తరరాఘవము" ఇది మూలమునకు మక్కికిమక్కి తెలుఁగుగాక స్వేచ్ఛానువాద మగుటచే "ఆంధ్రీకృతోత్తరరామచరితము" అని పేరిడక "ఉత్తరరాఘవము" అంటిని. ఏతత్పాఠకులు మూలగ్రంథమును దత్కవిని గూర్చి తెలిసికొనుటవసరము గావున ఆవిషయముల నించుక విజ్ఞాపిక:—

## భవభూతి—ఆతనివృత్తాంతములు.

మాలతీమాధవప్రస్తావనమువలన భవభూతి చరిత్ర మిట్లు తెలియుచున్నది. దక్షిణాపథమందలి పద్మనగరమునందు తైత్తిరీయబ్రాహ్మణులు (కృష్ణయజుర్వేదులు) కలరు. వీరు పంక్తిపావనులు సోమపీథులు, బ్రహ్మవాదులు. మన భవభూతి యీ తెగకుఁ జేరినవాఁడు. కాశ్యపగోత్రుఁడు ఇంటిపేరు ఉదుంబరంవారు ఈతని తాత భట్టగోపాలుఁడు తండ్రి నీలకంఠుఁడు తల్లి జాతూకర్ణి. శ్రీకంఠుఁడని యీతనిజన్మనామము "భవభూతి" అని బిరుదునామము. ఇదిగాక "ఉంబేకుఁడు" అను మఱియొకనామముగూడ కలదఁట. ఈతఁడు క్రీ॥ శ॥ ఎనిమిదవ శతాబ్దమున కన్యాకుబ్జము (Kanouj) పరిపాలించిన యశోవర్మదేవుని ఆస్థానకవిగా నుండెనని రాజతరంగిణి. కావున భవభూతి ఏడవశతాబ్దాంతముననో ౮వ శతాబ్దప్రారంభముననో యుండవలయు.

యశోవర్మ— శ్లో॥ "తపస్వీ కాంగతోఽవస్థా । మితి స్మేరాననావివ

గిరిజాయాః స్తనౌ వందే । భవభూతిసితాననౌ—"

అను నేత్రరచిత శ్లోకమును మెచ్చి "భవభూతి" అను బిరుదునామ మొసఁగెనఁట-వీరరాఘవటీక. అందుననే "సాంబాపునాతు భవభూతి పవిత్రమూర్తిః" అను మకుటముతోఁ జండీశశతకము రచించుటచేతను నీబిరుదునామము వచ్చిన ట్లుక్తము.

## — ఈతని పాండిత్యవిశేషము — గ్రంథములు. —

భవభూతి - తాను పదవాక్యప్రమాణజ్ఞుఁడ నని ప్రకటించుకొనెను మఱియు-

శ్లో॥ "యద్వేదాధ్యయనం తథోపనిషదాం యోగస్య సాంఖ్యస్య చ
జ్ఞానం తత్కథనేన కింనహి తతః కశ్చిద్గుణో నాటకే।
యత్ప్రౌఢత్వ ముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవమ్
తచ్చేదస్తి తతస్తదేవ గమకం పాండిత్యవైదగ్ధ్యయోః॥

అని తన వేదవేదాంగయోగసాంఖ్యపాండిత్యమును దెలుపుకొనెను.

ఈతఁడు "మాలతీమాధవము" మహావీరచరితము "ఉత్తరరామచరితము" అను నాటకముల రచించినాఁడు. "సమకాలమువారలు మెచ్చరే కదా" అనునది ఈయనకుం దటస్థించినది. సమకాలికులు కవులు తన్నసూయచే మెచ్చకపోవుటచే

మాలతీమాధవమున —

శ్లో॥ "యేనామ కేచి దిహ నః ప్రథయన్త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః।
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ॥

అని కొంత యుద్ధతిని వెళ్లబోసినాఁడు. ఉత్తరరామచరితమందును "యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" (యువతులందెట్లో యట్లే కవితలందు సాధుతానిర్ణయమున దుర్జనులు జనులు) అని యసూయాపరుల నించుకయుపేక్షింపక విడువలేదు. ఉత్తరరామచరితమే యీతని కడపటి నాటకము కానోపు. అసూయా విమర్శకుల నోరు నొక్కుటకో యన దీని నతిప్రయత్నమున సర్వాంగసుందరముగఁ జిత్రించినాఁడు. మాలతీవీరచరితములలోఁ జేసినకృషి దీనియందు సంపూర్ణముగ ఫలించినది. నాటకానుకూలరచనా వైదుష్యము కథాసంవిధానము కవితా నాట్యకలాకౌశలము అన్నియు దీనియందు సమగ్రములు. రసవిషయమునఁ గాళిదాసు శాకుంతలముకన్నను మిన్నయని ప్రతీతి. "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే"

## ఈతఁడు గొప్ప ప్రామాణిక కవి.

కావుననే 8 వ శతాబ్దమువాఁడును రమారమి యీతని సమకాలికుఁడేమో అని యూహింపఁదగిన వాఁడు నగు వామనుఁడు తన కావ్యాలంకార సూత్రవృత్తియం దీతని శ్లోకముల నుదాహరించియున్నాఁడు. క్షేమేంద్రుని ఔచిత్యవిచారమునందు నీతని శ్లోకములున్నవి. మరియు నీతని నాటకముల నెందఱో యనుకరించియున్నారు. ఈతని మాలతినుండి ఉద్దండకవి మల్లికామారుతప్రకరణమును దింపినాఁడు. పెక్కుటి రామాయణ నాటకములన్నియు నింతో అంతో యీతని వీరచరితపుటొరవడి దిద్దినవే. ఈతఁడును గొన్నిచోట్లఁ దనపూర్వుల ననుకరింపక పోలేదు.

## —♦ ఉత్తరరామచరితకథ ♦—

శ్రీమద్రామాయణము నుండి కొంత, జైమినీభారతమునుండి కొంత గ్రహించెను.

రామాయణమునుండి గ్రహించినభాగములు:—

(1) సీత తపోవనములఁజూడఁగోరుట. (2) శంబూకవధ. (3) అశ్వమేధము. (4) వాల్మీకితపోవనమునఁ గుశలవులు పెరుగుట. (5) కుశలవుల రామాయణగానము తదభిజ్ఞానము.

జైమినిభారతమునుండి:—

(1) యుద్ధము. (2) వాల్మీకిచే సీతాసంఘటనము.

జైమినిభారతమునఁ బిన్నలకుఁ బెద్దలతో జరిగిన కయ్యము గౌరవముగాదని ఔచితి పాటించి పిన్నలకుఁ బిన్నలకే జరిగినట్లు మాఱ్చె. ఈ నడుమ "కుంద మాల" యను ప్రాచీన నాటకమొకటి లభించినది. కవి దిఙ్నాగాచార్యుఁడు ఈతఁడు కాళిదాసు మేఘదూతమందలి "దిఙ్నాగానాంపథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్" అనుశ్లోకములోనివాఁడే. ఉత్తరరామాయణకథయే కుందమాలలోని యితివృత్తమును, ఇందుండి భవభూతి కథకంటెఁ గలాచిత్రణ మెక్కుడు సంగ్రహించినాఁడు. ఛాయాంకము, కుందమాల ఛాయకుఁ బ్రతిచ్ఛాయయే. సీతాపునస్సమావేశమునకు అతిలోకాద్భుతోపాయముగూడ నక్కడిదే. ఈపరికరముతో భవభూతి మహోన్నత సౌధమును నిర్మించినాఁడు, అందుఁ జిత్రపటములంకరించినాఁడు సీతను గంగకొప్పగించి పురుడుపోయించినాఁడు, శ్రీరామ పంచవటీసంచారముఁ జూపించినాఁడు, జనకాది వృద్ధజనములను వాల్మీక్యాశ్రమము చేర్చినాఁడు, అంతర్నాటక మాడించినాఁడు. పైమూఁడునిధులనుండి మూఁడుమణులం ద్రవ్వి తెచ్చినాఁడు, ప్రతిభాశాణమున నొఱచినాఁడు, హారముగ్రుచ్చినాఁడు, వాగ్దేవీకంఠమున సమర్పించినాఁడు అదిగో! ఆపేరే ఉత్తరరామచరితము.

## —♦ కాళిదాస భవభూతులు ♦—

సారస్వతనందనోద్యానమందలి మందార పారిజాతములు. ఉపాశ్రయించిన కొలంది సుగాత్తపుట్కములు లభించుచుండును, కాళిదాసు భవభూతికంటెఁ బ్రాచీనుఁడు. కావునఁ గాళిదాసుకవితామధువు నాస్వాదించు నవకాశము భవభూతికిలభించినది. తార్కాణములు కొన్ని ఉత్తరరామచరితమున "భ్రమిషుకృతపుటాంతర్మండలావృత్తిచక్షుః" (వలయంపున్నటన క్రమంబులెతిఁగింపక, నా తెలుఁగు 4 వ అం॥) అనుశ్లోకమున వర్ణితమైన సీతనెమిలి కాళిదాసు మేఘదూతములోని యక్షునెమిలికిఁ దోడబుట్టువే. మఱియు శాకుంతలములోని "భావస్థిరాణి జననాంతరసౌహృదాని" అను సూక్తమును విపులీకరించి భవభూతి, లవచంద్రకేతు సమావేశమునను రామకుశలవ సమావేశమునను, చక్షుఃప్రీత్యాది చిత్తవృత్తులను వర్ణించియున్నాఁడు. ఛాయాంకమున, "పూరోత్పీడే తటాకస్య" (వఱదవడి, దట్టముగ గట్టు లోఁబడియునపుడు) అను శ్లోకార్థము కుమారసంభవమున రతివిలాపములోని "స్వజనస్యహి దుఃఖమగ్రతో వివృతద్వారమివోపజాయతే" అను వాక్యమున కించుమించుగా వివరణమే. కాళిదాసునకు భవభూతికవితామృతరసము నాస్వాదించు యోగము లేకపోయినుగాని. ఉండినచో నాతఁడును భవభూతి ననుకరింపకపోవునా? తనపూర్వుల వాల్మీకి భాసములఁ గాళిదాసనుకరించి యుండలేదా? కాళిదాసభవభూతులకున్న వార, ఒకఁడు వ్యంగ్యప్రధానుఁడు, వేఱొకఁడు వాచ్యప్రధానుఁడు. ఇట్లని భవభూతికవితకు వ్యంగ్యవైభవము లేకపోలేదు. సర్వతారణ్యనదీజంతువర్ణనమున భవభూతికలమునకుఁ గుదిరిన ఆతీర్పు ఆపదిరిక యే కవికలమునకుఁ గుదురును? జనస్థానదృశ్యము చదువరులకుఁ బ్రత్యక్షమే కదా. రసవిషయనిర్వాహణమునందుఁ గాళిదాసెంతో జాగరూకుఁడై మెలంగును. తన మనఃపీఠమున శ్రోతను గూర్చుండఁబెట్టికొని, అతఁడానందించుచుండునో వెక్కసపడి విసువుచే మొగము చిట్లించుచుండునో, అనుక్షణము గని పెట్టుచునే గ్రంథమునడుపును. భవభూతికా గొడవయే పనికిరాదు. అతఁడు రసమయుఁడు. అవ్యాహతానంద ప్రవాహమునంబడి కొట్టుకొని పోవుచుండును. ఆప్రవాహమునకు నే కొండయో అడ్డు తగిలినప్పుడే ఆతనికి మెలఁకువ. ఆంధ్రకవులతోఁ బోల్చితిమేని కాళిదాసు తిక్కన, భవభూతి పోతన. భవభూతిభావము సహజముగానే ఉదాత్తము, పవిత్రము భాషయు దానికిఁ దగినట్లు గంభీరము, కాళిదాసుకంటె నన్నను దోసములేదు. అందున ఉ॥ రా॥ చరితము అత్యుదాత్తనాయికానాయకోపేతమగుటచే శాకుంతలముకంటెను పవిత్రతరమైనది. శాకుంతలమున

మొట్టమొదటఁ గేవలకామమే వర్ణితము. కవిచేతిలోఁ బరసువేది యుండుటచే ఆ సారాయమే అమృతమైనది, బంగారుకలశమునఁ బోసి కవి దానిని శ్రోతలచే, ద్రావించినాఁడు. ఉ॥ రా॥ చరితమున వర్ణితమైనది దివ్యప్రేమ అది నిష్కల్మషము, నిరవధికము, నిష్కామము. రామునకు దుష్యంతున కెక్కడి కెక్కడ? దుష్యంతుఁ డెంత ధీరోదాత్తుఁడైనను, లాలసుఁడు, బహువల్లభుఁడు, స్వార్థపరుఁడు. అందులకే అబద్ధ మాడుటకైన వెనుదీయలేదు. తల్లిగారి వ్రతముకంటెఁ దాపసకన్యావ్రత భంగమే స్వర్గము మోక్షమని తారాడినవాఁడు రాముఁడో ప్రేమమయుఁడు, ఏకపత్నీవ్రతుఁడు, లోకారాధనతత్పరుఁడు. దానికై ప్రేమాస్పదను భార్యను సైతము విడిచిన త్యాగమూర్తి. ఇఁక శకుంతలయో పరిత్యజించిన భర్తను "అనార్యుఁడా" అని తిట్టిపోసినది. అప్పటున సీత భర్తను దాను గోపింపకపోఁగా, నిందుక కోపించు వాసంతికనుగూడ సదలించినది. తన విరహవ్యథను మఱచి భర్తృవిరహవ్యథకై తపించినది. ఈ కారణములచే ఉత్తరరామచరితమునకు సర్వాతిశాయిత్వము వచ్చినది. కావుననే-

"నాటకే భవభూతిర్వా వయంవా వయమేవ వా
ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" అని ఆభాణకము.

ఉ. రా. చరితముకంటె నిర్మల ప్రేమానందమును వర్ణించిన ఆదర్శ నాటకము వేఱొకటి సారస్వత ప్రపంచమున లేదు. లేనేలేదు. ఇట్లయ్యు కొన్ని శంకలు:—

## సీతాపరిత్యాగము న్యాయ్యమా?

కాదనువారి యాక్షేపణము లివి—

(1) అగ్నిపరీక్షయైన పిమ్మటనే కదా రాముఁడు సీతను లంకనుండి గ్రహించెను. రామునిహృదయమున సీతాసౌశీల్యముగూర్చి యెట్టి సందేహము లేదుకదా. అట్టిచో నేదో కింవదంతిని బురస్కరించుకొని సీత నడవి కంపుట ఆత్మవంచనము కాదా? ఆ కింవదంతియైనను నొక సామాన్యచారుఁడు తెలిపినదే కదా. అందలి సత్యాసత్యములు విచారింపనైన వలదా? అవిచారితముగ "ఆతంకస్ఫురితకఠోరగర్భగుర్విని అడవిపాలు చేయుట అమానుషము కాదా?

(2) శకుంతలాపరిత్యాగమునకుఁ గాళిదాసు దుర్వాసశ్శాపము నొక యుపపత్తిని గల్పించి దుష్యంతుని బాగుచేసినాఁడు. భవభూతికా తెలివితేటలు లేక రాముని సాపాటురాముని చేసి వేసినాఁడు.

ఈ తుక్కుశంకలు ప్రాయికముగఁ బడమటిగాలిం గొట్టుకొనివచ్చినవే. ప్రాచ్యధర్మనివిష్టమగు దృష్టితోఁ బూర్వోత్తరముల నొకించుక పరామర్శించినచో సమాధాన

ములు కంటికిఁ గట్టినట్లుండును. ఈపూర్వపక్షములకు మొదటినుండియు సిద్ధాంతములఁ బన్నుచునే మహాకవి సీతాపరిత్యాగమును నిర్వహించినాఁడు. చూడుఁడు.

(1) సీత కగ్నిపరీక్ష జరిగిన దెక్కడ? లంకలో-ప్రవాదమో? అయోధ్యలో-అట్లయిన "అగ్నిపరిశుద్ధి చేసితి మంటి మేని అగుననుచు నమ్మ దూరవృత్తాంత మెవఁడు?" అని సమాధానముండనే యున్నదికదా- సీతాసౌశీల్యముగూర్చి రామునకు సందేహము లేదు. సందేహము లోకమునకే- తన్నివారణార్థమే పరిత్యాగము, దానిపేరే లోకారాధనవ్రతము. కలదుగదా ఇందులకు వసిష్ఠోపదేశము, "అల్లుని మఖంబు...... ......జనుల రంజించి కాంచు యశంబె ధనముకంటెఁ బ్రాణంబుకంటె యోగ్యంబు మీకు" అని. దీనికి విధేయముగ "దేశజనరంజనక్రియా దీక్షయందు..........కడకు నీజనకసుతనుగాని విడనాడుచో వెనుకాడఁబోను." అని రాముఁడు నిశ్చయించెను గదా! పతి నిశ్చయమునకు "కావుననే యార్యపుత్త్రులు రఘువంశధురంధరులు" అని సీతయే ఆమోదించెఁగదా! ఇఁక నేదోకింవదంతియని రాముఁడు లక్ష్యము చేయకుండుట యెప్పుడు? ప్రజలు దుర్జనులైనప్పుడు, దుర్ముఖుఁడు, "దేవా! దుర్జనులవాక్కులు లెక్కగొని......" అని నుడవింపఁబోఁగా రాముఁడేమనెను? "నాప్రజలు దుర్జనులనవచ్చునా? "ప్రజల కభిమాన మిక్ష్వాకువంశమనిన" అని సమాధానము చెప్పియుండలేదా? సరే మొదలట్టి సత్ప్రజలలో నిట్టి ప్రవాదమేల పుట్టవలయునన్న శంకకు "విధివశత నంగొనిందసఁగీజమొదవె" అనునదియే జవాబు. కాన రామునియందుఁగాని సీతయందుఁగాని కడసఁ బ్రజలయందుఁగాని దోసములేదు. లేనప్పుడు పరిత్యాగమేల? తనపైఁ బ్రజకు నంతగా భక్తివిశ్వాసము లున్నప్పుడు వారి నొకచో సమావేశపఱచి తానే వారి సమాధానపఱుపఁగూడదా? కూడదు; ఆమార్గము తనకుఁగాని సీతకుఁగాని ప్రజకుఁగాని గౌరవముకాదు. ఈపడి కేవలము విధివశమున సంభవించినది కావున, దీనిందుడిచివేసి సీతామాహాత్మ్యమును బ్రకటింపవలయునన్న వెనుకటికంటె నద్భుతము లోకాతీతమునగు విధానమునే పూనవలయు. సరే, అట్టి విధానమే వెంటనే యేలపూనలేదు? దానికైనవారు అరుంధతీవసిష్ఠులు, అప్పటికి ఋష్యశృంగుని యజ్ఞమునఁ బనివడియున్నారు. తంతిపైఁ బిలిపింపవలదా? ప్రాజ్ఞుఁడు రాముఁడెట్లు పిలిపించును? వారెట్లు వత్తురు? క్రతుభంగము కాదా- ప్రత్యవాయము రాదా? కావున సీతాపరిత్యాగముకన్న రామున కప్పటికి వేఱుమార్గమే లేదు. ఈప్రవాసమున సీతకేదేని ప్రమాదము సంభవించిన గతియేమి? అట్లేలజరుగు? "పుత్రపూర్ణోత్సంగను ఆయుష్మతిని నిన్నుఁజూచి ఆనందింపఁగలము" అను ఋష్యశృంగాది వృద్ధాశీః ప్రభావమున్నదిగదా! ఇక వేళ

పరీవాదమే తటస్థించిన తన లోకారాధన వ్రతత్యాగమునకు మఱింత మెఱుఁగే అని రాముఁడు నిర్ణయించుకొని యుండరాదా? సరే, సామాన్యచారుని మాటనమ్మ వచ్చునా?-చారలక్షణ మెఱింగినచో నీ శంకకు నాస్పదమే యుండదు. చారులు రాజులకుఁ బరమవిశ్వాస్యులు "రాజానశ్చారచక్షుషః" రామునకుఁ బ్రజలందఱు విశ్వాస్యులు కాఁగా, చారులు స్వామిద్రోహు లగుదురా? కావున నీశంకనింకఁ దలపనక్కఱలేదు. విచారింపనైన వలదా? సాక్షులు సమక్షలో సీతను రచ్చ కీడ్పింపవలెనా యేమి? "శాంతం పాపం." విచారణము కావలసినంత రాముని అంతర్యుద్ధమున నున్నది, ప్రథమాంకమున పరిత్యాగ ఘట్టమునఁ జూచికొనుఁడు. "ఆతంకస్ఫురితకఠోరగర్భగుర్విని" అడవిపాలుచేయుట అమానుషము కాదా? సందర్భమునుబట్టి-కాదు. రామునికీర్తి కాసమయము మెఱుఁగే తెచ్చినది. అడవిపాలు చేయలేదు. వాల్మీకితపోవనముపొంత విడిచిరమ్మనెను. కవి ఈ శంకలకెల్ల సమాధానము లాయాపాత్రలనోటనే పలికించినాఁడు. చూడుఁడు. వాసంతి-"దేవా! యింతటికి యకార్యమొనరించితి వేల? రాముఁడు- లోకము సైరింపదని- జనకుని నరుంధతి సమాధానపఱచినది. కన్నకడుపు తీపిచే పృథ్వీదేవి రాముపై నలిగినప్పుడు భాగీరథి, "అలమిన్ సర్వశ మెల్లలోకముల" అను పద్యమున నోదార్చినది, పృథ్వి శాంతించినది. ఏడవయంకమున జూడుఁడు. సరే ఇంకనొక సందేహము. పరిత్యాగవార్త యింతకాలము అరుంధతీవసిష్ఠాదులకుఁ దెలియకుండుట సంభవమా? కాదు. కొంతకాలమునకుఁ దెలిసినది. వాల్మీక్యాశ్రమమునఁ జేరి వారు సమాగమోపాయమును జెప్పుచునేయున్నారు. వాల్మీకి స్వప్రభావముచేత దేవాసుర మానవ నికాయ్యం బగు చరాచర భూతప్రపంచము నక్కడ సమావేశపఱచినాఁడు. అరుంధతీ భాగీరథులు సీతా మాహాత్మ్యమును బ్రకటించినారు. పుత్రులతోఁ గూడ రామునకు సీతా సమావేశమైనది.

(2) పరిత్యాగమునకుఁ గాళిదాసువలె భవభూతి యుపపత్తి గల్పింపలేక పోయెను శంకకుఁ బైఁజెప్పినదంతయు సమాధానమే లోకారాధనదీక్షయే పరిత్యాగమునకు నుపపత్తి. కాళిదాసుని శాపకారణముకంటె నిదియే యెక్కుడు సహజమేమో యోజింపుఁడు. సీతాపరిత్యాగము ధర్మ్యమనుటకు (Kale) కాలే పండితులు.

"Shallow critics with their gratuitous sympathy with Sita for her cruel abandonment in the forest, are inclined to find fault with Rama for his undue solicitude

for the contentment and happiness of his overnice subjects. They miss the very beauty of Rama's life when they take such a narrow view of it. Judged by the ideal standard of duty, Rama deserves our approbation for his wonderful self sacrificing nature, rather than condemnation for the seemingly cruel deed............As he lived for his subjects he was bound to please them at any cost. Though he was conscious of the sterling womanly qualities of Sita — an idealistic picture of crury virtue that ennobles woman-hood when called upon by the stern Voice of Duty, Rama throws her off inwardly feeling the deepest anguish for the cruel step that he is forced to take (Kale)

## —♦ ర స వి చా ర ము. ♦—

ఉత్తరరామచరితమునందుఁ బ్రధానరసమేది? ఈచర్చలో దిగ్గజములు డీకొని పోరాడుచున్నవి. కరుణరసమని కొందఱు విప్రలంభశృంగారమని కొందఱు వీరరసమనువారుగూడఁ గొందఱు లేకపోలేదు, కాని, ఈవాదము క్వాచిత్కము. ఈవాదములం దేది బలిష్ఠమో నిర్ణయించుటకుఁ దొలుత నాయా రసస్వరూపములఁ దెలిసికొనుట యావశ్యకము.

కరుణరసస్వరూపము:—

"ఇష్టనాశా దనిష్టాప్తే శ్శోకాత్మా కరుణః (దశరూపకము)

ఇష్టనాశమువల్లను అనిష్టప్రాప్తివల్లను, సంభవించిన శోకాత్మకమగు మనోవికారము కరుణరసమనఁబడును. దీనికి స్థాయీభావము శోకము. ఇఁక శృంగారము రెండువిధములు - సంభోగము - విప్రలంభము. దీనికి స్థాయీభావము రతి అనఁగా అన్యోన్యాభిలాషము. విప్రలంభము నాలుగువిధములు. "పూర్వానురాగము, మానము, ప్రవాసము, కరుణము." అని

"సవిప్రలమ్భో విజ్ఞేయస్సచతుర్ధా నిగద్యతే ।
పూర్వానురాగమానౌచ ప్రవాస కరుణావితి ॥ (రసార్ణవసుధాకరః)

విప్రలంభకరుణరసస్వరూపము:—

“యూనో రేకతరస్మిన్ గతవతి లోకాంతరం పునర్లభ్యే ।
విమనాయతే యదైక స్తదా భవేత్కరుణవిప్రలమ్భాఖ్యః ॥ (సా॥ దర్పణము

దంపతులలో నొకరు లోకాంతరమున కేగి మరల లభించువారుగా నుండిన లభించువఱకు రెండవవారు విలపించుటయే కరుణవిప్రలంభము. కావున శోకస్థాయి, యగు కేవల కరుణరసమునకును రతిస్థాయి యగు కరుణవిప్రలంభమునకును గొంత భేదము కలదు. ఆభేద మిట స్పష్టము— చూడుఁడు,

“స్త్రీపుంసయోస్తు వియోగే జీవిత్వజ్ఞానదశాయాం వైక్లబ్యపోషితాయా రతే రేవ ప్రాధాన్యాత్ శృంగారో విప్రలమ్భాఖ్యో రసః వైక్లబ్యంతు సంచారిమాత్రమ్॥ మృతత్వజ్ఞానదశాయాన్తు రతిపోషితస్య వైక్లబ్యస్యేతి కరుణఏవ యదాతు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవనజ్ఞానం కథఞ్చిత్స్యాత్తదాఽఽలంబనాత్యంతికనిరాసాభావాచ్చిరప్రవాసఇవ విప్రలమ్భ ఏవ న స కరుణః॥(రసగంగాధరము)

(వివరణము:— స్త్రీపురుషులకు సంభవించిన వియోగమునందుఁ బరస్పరము బ్రతికియే యున్నారను జ్ఞానమున్నప్పుడు, వైక్లబ్యమను సంచారీభావముచేఁ బోషింపఁబడిన రతికే ప్రాధాన్యము కావున విప్రలంభశృంగారమే యగుచున్నది. మృతత్వజ్ఞానదశయందు రతిచేతఁ బోషింపఁబడిన వైక్లబ్యసంచారికే ప్రధానము గాన కరుణరసమే యగుచున్నది. మృతత్వజ్ఞానమున్నను దేవతాప్రసాదాదులచే మరల నెట్లో జీవించునను జ్ఞానము కలిగియున్నచో, మన స్థైర్యమునకు నాస్పదముండుటచేఁ జిరకాలప్రవాసమునందువలె విప్రలంభమే యగును కాని కరుణముగాదు.

ఈ లక్షణములం బట్టి ఉ॥ రా॥ చరిత ప్రధానరసము కరుణమో కరుణవిప్రలంభమో నిర్ణయించుటకు, సీతాజీవితాశ యున్నదా లేదా అను విషయము ముందు దేల్చుకొనవలయును. జీవితాశ లేదని కరుణవాదులు:—

(1) పిన్ననాఁటనుండి, (2) బాళిన్నమ్మి, (3) ప్రియవయస్యన్ మాపి. (4) కాయలతికన్ మ్రింగెన్ వనీసత్వముల్.

ఇట్టివే మఱికొన్ని వాక్యముల నుపపాదించి సర్వత్ర శోకమే స్థాయి యని కరుణరసమే సిద్ధాంతమందురు. సరేకాని, వీనికేమందురు ?

“వీరశృంగారయో రేకః ప్రధానం యత్ర వర్ణ్యతే ।
ప్రఖ్యాతనాయకోపేతం నాటకం త దుదాహృతమ్. (దశరూపకము)
“ఏక ఏవ భవే దఙ్గీ శృంగారో వీర ఏవ వా” (సాహిత్యదర్పణము)

వీనింబట్టి నాటకమునకు వీరశ్శృంగారములలో నేదేని యొకటియే ప్రధానముగా నుండవలయుం గదా? కరుణ మొట్టమొదట నెఱిగినన, మహాకవి భవభూతి కీ నియమము పనికి రాదు. ఆతఁడు నూతనమార్గము ద్రొక్కినాఁడు. ఉ॥ రా॥ చరితము కరుణరసప్రధానముగానే నిబంధించి "ఏకోరసః కరుణ ఏవ" అని సిద్ధాంతముచేసెనందురు. సీతా పునస్సమాగమము గల్పింపక నాటకము శోకాంతముగనే చేసియుండిన భవభూతి నూతనత్వము విస్పష్టమయ్యెడిది ఇన్ని వాదముల కాస్పదమే లేకుండెడిది. నాటకము మోదాంత మగుటచే రసాంతర వాదమున కవకాశము కలిగినది. కావుననే—

## సీతా జీవితాశ యున్నదని కరుణ విప్రలంభవాదులు:—

(1) పుత్రపూర్ణోత్సంగను ఆయుష్మతిని నిన్ను జూచి యానందింపఁగలము" అను ఋష్యశృంగాదుల ఆశీర్వచనము, రామున కందు గల విశ్వాసము.

(2) పరిత్యాగ సమయమున రాముఁడు సీతను పృథ్వీ భాగీరథుల కప్పగించుట.

(3) పంచవటియందు రాముఁడు సీతను బలుమాఱు సంబోధించుట.

(4) అశ్వమేధమందు సహధర్మచారిణిగా సీతాప్రతిమ నుంచుకొనుట.

(5) "మహర్షులు సర్వధర్మములఁ బ్రతీక్షించినవారు వారి ప్రజ్ఞానంబుల కన్యథాత్వము సంభవింపదు, కావున సంశయింపనే కూడదు." అని రాముఁడు నిశ్చయించుట —

ఇట్టివే మఱికొన్ని వాక్యముల నుపపాదించి సర్వత్ర రతియే స్థాయిగా సమన్వయించి, విప్రలంభమే సిద్ధాంత మందురు. "ఏకోరసఃకరుణఏవ" అని కవియే చెప్పెఁగదా. దీని కేమందురన్న అక్కడి కరుణపదము నిరుక్తకరుణరసపరము కాదు, అగుచో స్వశబ్దవాచ్యత్వరూపరసదోషము సంభవించును. భవభూతియంతటి మహాకవి కీదోష మాపాదించుట సాహసము. అక్కడి కరుణపదమునకు దుర్భరవిరహవ్యథయే అర్థమని సమర్థింతురు. మఱియుఁ కరుణవాదు లుపపాదించు నిరాశాపర వాక్యములయందు, వైక్లబ్యసంచారిచేఁ బోషింపఁబడిన రతియే కాని నైరాశ్యము లేదనియుఁ గరుణవిప్రలంభమే అంగి కరుణము అంగమనియు సిద్ధాంతీకరింతురు.

ఇఁక వీరవాదము —వీరరసము మూఁడు తెఱంగులు- ధర్మవీరము, యుద్ధవీరము, దానవీరము అని, దయావీరముతో నాలుగని కొందఱు. హరిశ్చంద్రుఁడు ధర్మవీరుఁడు, భీమాదులు యుద్ధవీరులు, బలి దానవీరుఁడు, శిబి జీమూతవాహనులు దయావీరులు. రాముని లోకారాధనవ్రతమే సీతాపరిత్యాగమునకుఁ గారణమగుట,

రాముఁడు ధర్మవీరుఁడు. "దేశజనరంజనక్రియాసిద్ధి యందు...కడకు జనకతనూజనుగాని విడనాడుచో వెనుకాడఁబోను" అను రామవాక్యమునందు కొండటనే కవి వీరరస బీజము నిక్షేపించినాఁడు. వీరసమైనను బిమ్మట దీనినుండి యుత్పన్నమైనదే కావున ఉ. రా. చరితమున వీరరసము అంగి, విప్రలంభము అంగమని వీరవాదుల సిద్ధాంతము.

ఈ వాదస్వరూపములఁ దెలిసికొనుట మఱియుత్తరరాఘవ రసనిర్ణయమునకు నవసరమే కావున నీ విషయ మింతగా వివరించితిని.

**ఉత్తరరాఘవమున కరుణ విప్రలంభమే అంగి, కరుణము అంగము**

ఇందులకుఁ సాధకవాక్యము లెక్కుడుగా నున్నవి. మూలములోని ప్రత్యాశా వాక్యములను రెండవయంకములోని సీతాలక్ష్మణవాక్యములతో తగుటచేఁ బ్రత్యాశ మతింత నిరూఢము. చూడుఁడు, "ఈకనుంగవ" "తనువుపైగోసి" "కన్నీరుమున్నీరు" అను పద్యము మొదలు "కమనీయంబులు" అను పద్యము వఱకుఁగల సీతావాక్యము లన్నియును బ్రత్యాశను బోషించునవే కావున, కరుణ విప్రలంభమే అంగి యగును. "వీరరస మేలకారాదు?" అని నాగ్రంథము చదివిన ప్రాజ్ఞులలో నొకరు, ప్రథమాంకమున "దేశరజన రంజన..........కడను జనకతనుజను గాని విడనాడుచో వెనుకాడబోను" అని రాముని ధర్మవీరవాక్యమును, దానికి "కావుననే ఆర్యపుత్త్రిలు రఘుకులధురంధరులు" అను సీతావాక్యమును, ద్వితీయాంకమున "ఒకరొడ స్వప్రజానిష్కృతి మొదలు "నాగాంగనలు" అను పద్యము వఱకుఁగల వాక్యము లన్నియును ధర్మవీరత్వ సాధకములే యని నిర్ణయించిరి. సిద్ధాంత భారము గనజ్ఞలోకమునకే వదలి యీచర్చనుండి యింతట విరమించెదను.

---

## ఆంధ్రీకరణము.

ఉత్తరరాఘవము, మూలమునకు మక్కికిమక్కి తెలుఁగుగాదని, మున్నే తెలుపు కొంటిని. ఉన్నతోద్రేకభావములు లేక, కేవల కథాసరణి ననుసరించు శ్లోకములను నాట్యానుకూలముగ గద్యమే వ్రాసితిని. వర్ణనప్రధానములైన కొన్నిశ్లోకములను మానివేసితిని. కొన్నిచోట్ల స్వతంత్రరచనలఁ గావించితిని. ప్రథమాంకములోని "(1) కలసి నివ్వరి (2) దొరకునా (3) ఎలమికన్నీటి (4) పనికత్తెలెందఱు (5) నేనావంతయు (6) పరమసాధ్వీత్వ" అను పద్యములును, ద్వితీయాంకమంతయును, తృతీయాంకములోని శంబూకవధఘట్టమున "మనుమార్గంబిది" అను పద్యమువఱకు గలభాగమును, పంచమాంక ప్రారంభమున, లవకుశగాలవుల విష్కంభమును స్వతంత్ర

రచనలు, భాషాంతరీకరణములు కావు. 4 వ అంకమందలి విష్కంభము మూలవిష్కంభమునకు సంగ్రహానువాదము. ప్రదర్శనాసౌలభ్యమునకై తమసాపాత్రము మాని వేయఁబడినది. శేషించిన గ్రంథమంతయు మూలమున కనువాదమే. ఇదిగాక, యథామూలముగ గ్రంథమంతయు నాంధ్రీకరించియున్నాను. వీలువెంబడి దానింగూడ నాంధ్రలోకమున కందింతును.

కలుషంబుల్ దొలఁగించి యీ కథ జగ ♦ త్కల్యాణియై మేలు వ
ర్షిలఁ జేకూరుచుఁగాక లోకజనయి ♦ త్రీ జాహ్నవింబోలి, ని
చ్చలు వాగ్బ్రహ్మకవిప్రరూఢమగు ప్ర ♦ జ్ఞావాణి నీ రూపకం
బిల సేవింతురుగాక రంగములయం ♦ దింపార విద్వన్మణుల్ ||

—♦ కృతజ్ఞత ♦—

ఆంధ్ర యూనివర్సిటీ వారీ నాటకము నింటర్మీడియేటు తరగతికిఁ బఠనీయగ్రంథముగా నిర్ణయించుటంజేసి, మూఁడవతూరి ముద్రణమున కవకాశము కలిగినది: వారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈపూర్వనం దుచితములని తోఁచిన కొన్ని మాఱ్పులు చేసితిని. గ్రంథమం దేమేని గుణముండిన, రసికలోకమే ప్రకటించుఁగాక.

గుంటూరు,
10—7—30. } బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఉత్తర రాఘవము.

## ప్రథమాంకము.

---

### నాందీ—ప్రస్తావన.

గీ॥ ఆదిమ కవీంద్రులకు నభి ♦ వాదనంబు
నభిలషించి సమర్పింతు ♦ మాదరమున
అమృతయును నాత్మకలయునౌ ♦ నట్టి వాణి
నిత్యకళ్యాణి మాకు రా •ణించుగాక.

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

అతివిస్తరమేల? ఆర్యమిశ్రులారా! వినియుందురుగదా, మహానుభావునిఁ గాశ్యపుని, శ్రీకంఠపదలాంఛనుని, పదవాక్యప్రమాణతత్త్వజ్ఞుని, జాతూకర్ణీపుత్రకుని. భవభూతియను మహాకవిని, వశీకృతవాణియగు తత్కవిచే గీర్వాణభాషలో రచియింపఁబడి, విదర్భదేశములోని పద్మనగరమునందు భగవంతుండగు కాళప్రియనాథుని మహోత్సవసమయమునఁ బ్రదర్శింపఁబడి విశ్వవిఖ్యాతిఁబడసిన యా "ఉత్తరరామచరిత నాటకమును" కొలందిమార్పులతో, బుద్ధిమతీవిలాస, సత్యహరిశ్చంద్రీయ సాత్రాజితీయాద్యనేక నాటకగ్రంథకర్తలగు బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగా రాంధ్రమున ననువదించి యున్నారు. దానినిప్పుడు మీ యెదుటఁ బ్రదర్శింప నెంచితిమి. సావధానముగ నవధరింతురుగాక:-

కార్యవశమున నే నిప్పు డయోధ్యాపురవాసినయి రామసమకాలికుఁడనై తిని. (అంతటఁ గలయంజూచి) ఓహో! ఏమిది పౌలస్త్యకులధూమకేతువగు శ్రీరామసార్వభౌమునిపట్టాభిషేకసమయముకదా!

రాత్రిందివము లవిచ్ఛిన్నముగ మహానందనాందీవాదములతో సంచ
రించు నీచత్వరస్థానంబు లేలకో చారణవ్యాపారములు లేకపూఁటు
మణఁగి యున్నవి.

నటుఁడు—(ప్రవేశించి) భావా! ఎఱుంగవా యేమి? ఈయుత్సవము
లెల్ల నెవరినారాధించుటకై యిన్నిదినములు జరిగెనో యట్టి
లంకాసంగ్రామమిత్త్రుల మహానుభావుల వానరులను రాక్షసు
లను, నానాదిగంతాగతులగు పూజ్యుల బ్రహ్మర్షి రాజర్షి సత్త
ములను, నెవరియిండ్లకు వారిని మహారాజుగారు పంపివేసినారు
కదా; మఱియు నిప్పుడు,

గీ. అల్లునిముఖంబుగనఁ దదీ ♦ యాశ్రమమున
కరిగి రవనీశుతల్లులుం ♦ దఱు నరుంధ
తీసతీమణి వెనువెంట, ♦ దేశికేంద్రుఁ
డలవసిష్ఠుఁ డధ్వస్థాత ♦ యై మెలంగ.

సూత్ర—భావా, విదేశీయుఁడగాన నడుగుచున్నాను. అల్లుఁడెవ్వరు?

నటు—సీ. దశరథున కుద్భవించె శాం ♦ తయనుకన్య
రోమపాదుండు ముద్దార ♦ నామెఁ బెనిచె
ధర్మపత్నిగ నల విభాం ♦ డకసుతుండు
ఋశ్యశృంగుఁడక్కన్నెఁ బ ♦ రిగ్రహించె.

ఆయల్లుఁడే యిప్పుడు ద్వాదశవార్షిక యజ్ఞమును బ్రారంభించి
నాఁడు. పూర్ణగర్భయగుటచేఁ గోడలిని సీత నింటనే విడిచి తప్పని
విధిగాఁ బెద్దలందఱా యాగమున కేగిరి.

సూత్రి—ఆగొడవంతయు మన కేల? పద. రాజద్వారము నాశ్రయించి
మన కులధర్మము ననుసరింతము.

నటు—ఆలాగైన మహారాజుకొఱకుఁ బరిశుద్ధమైన స్తోత్రపద్ధతి నేదేని
నిర్ణయింపుము.

సూత్ర—మారిషా !

గీ॥ ఎల్లవిధముల నుతియింపు ♦ మేల శంక
తప్పు లెన్నుట యెట్లును ♦ దప్పదింక;
యువతులం దెట్లొ యట్లులే ♦ కవితలందు
సాధుతానిర్ణయమున దు ♦ ర్జనులు జనులు॥

నటు—కడుంగడు దుర్జను లనుము.

గీ॥ జానకీదేవిఁ గూర్చియే ♦ జనులు లేని
పోని యపవాదలను దల ♦ మోపినారు
హేతు వింతకు రక్కసు ♦ నింట నుంట
వహ్నిపరిశుద్ధిమాట య ♦ బద్ధమంట

సూత్ర—హాహా? ఈకింవదంతి మహారాజుచెవి సోఁకెనేని కోపము నుఁగునే !

నటు—కాని సర్వథా వేల్పులును ఋషులును శ్రేయమాపాదింతురు గాక! (పరిక్రమించి) మహారాజుగా రిప్పు డెందున్నారో ? (విని) ఇట్లనుకొనుచున్నారు.

మ॥ అనుఁగుం గూఁతును నల్లునిం గన విదే ♦ హాధీశుఁడేతెంచి, మ
న్నన నిన్నాళ్ళు మహోత్సవంబుల మహా♦నందంబునం దీర్చి కొ
న్నన నేఁడే తనయింటికేగెనని వం ♦ తంగొన్న సీతం బ్రియం
బునఁ దేర్పం బ్రభు వేగె వాసభవనం ♦ బుం గొల్వు సాలించుచుం॥

(ఇరువురు నిష్క్రమింతురు.)

—♦ ఇది ప్రస్తావన.) ♦—





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము

## ప్రథమాంకము.

(శ్రీరాముఁడును సీతయు నుపవిష్టులై ప్రవేశింతురు,)

రాము — దేవీ! వైదేహీ! ఊరడుము. మనపైఁ బ్రేమలేకయా మీ తండ్రిగారు వెడలిపోయినది? నిత్యకర్మానుష్ఠాన తత్పరులయిన వారికి, స్వేచ్ఛావర్తనము సాగివచ్చునా? అహితాగ్నులగృహస్థ ధర్మ మాచారభంగ సందేహములతో ననుక్షణము సంకట మైనదని యెఱుంగవా?

సీత — ఎఱుంగుదును; అయినను బంధుజనవియోగములు మనస్సుల వ్యాకులపెట్టక మానవుకదా.

రాము — ప్రేయసీ; ఇవియే సంసారములోని భావములు, హృదయముల విదారించునవి. వీని నేవగించియే జ్ఞానులరణ్యముల విశ్రమింతురు.

కంచుకి — (ప్రవేశించి) రామభద్రా! (అని శంకించి) మహారాజా!

రాము — ఆర్యా! తండ్రిగారి పరిజనము నన్ను "రామభద్రా" అని పిలుచుటయే నాకు ముచ్చట, అలవాటు తప్పింపకుము.

కంచుకి — ఋష్యశృంగాశ్రమమునుండి అష్టావక్రులు దయచేసినారు.

సీత — అభ్యంతరమేమి!

రాము — వెంటనే ప్రవేశపెట్టుము.

అష్టా—(ప్రవేశించి) మీకు శుభమగుఁగాక!

రాము—అభివందనము. ఇటుదయచేయుఁడు.

సీత—వందనము. కుశలమేకదా పెద్దలందఱికిని మావదినె శాంతమ్మకును?

రాము—నిర్విఘ్నముగ సాగుచున్నదా యజ్ఞము?

సీత—అయ్యో! వారు మమ్ముఁ దలంచుచున్నరా?

అష్టా—దేవీ! భగవంతుఁడు వసిష్ఠుఁడిట్లు నిన్నుఁగూర్చి చెప్పుమనియె.

సీ॥ వివిధప్రజారాధ్య ♦ విశ్వంభరాదేవి కడుపారఁగా నిన్నుఁ ♦ గన్నతల్లి
అపరప్రజానాథుఁ ♦ డని జగన్నుతిగన్న జనకరాజర్షి నీ ♦ యనుఁగుఁదండ్రి
భువనబాంధవుఁడు మే ♦ మును వంశగురులముగా నలరారువారి కో ♦ డలవు నీవు
మనుకులాలంకార ♦ మునకు రామునకు, గుణాభిరామునకు న ♦ ర్థాంగివీవు
గీ॥ అమ్మగో! యింతకంటె సం ♦ ప్రార్థ్యమైన శ్రేయ మెయ్యది గురులమా ♦ శీర్వదింప
రఘుకులధురంధరుల సుపు ♦ త్రకులఁ గాంచి వీరమాతృమతల్లివై ♦ వెలయు తల్లి! ॥

రాము—దేవీ! అనుగ్రహింపఁబడితిమి.

అష్టా—రామభద్రా! భగవతి యరుంధతియు శాంతయు పదేపదే నీకుఁ జెప్పుమనిన సందేశమిది. "వేవిళ్ళగుటచే జానకి యేమేమి యభిలషించుచుండునో వానిని వెంటనే నెఱవేర్చుచుండుము" అని.

రాము—ఆలాగుననే; కోరినదే తడవుగా.

అష్టా—వత్సా! జానకీ! నీయాఁడుబిడ్డయు ఋష్యశృంగులును నీకుఁ బలుమాఱుఁ జెప్పిన దిది. "అమ్మాయీ! నీవోపలేవిదానవగుటచే యజ్ఞమునకు నిన్నుఁదోడ్కొని రాకుంటిమి. అబ్బాయిని రామభద్రుని నీవినోదముకొఱకే నీయొద్దవిడిచివచ్చితిమి. పుత్రపూర్ణోత్సంగవగునాయుష్మతినినిన్నుఁజూచి యానందింపఁగలము." అని

రాము—(చిఱునగవుతో) తథాస్తు. వసిష్ఠభగవానులు నాకేమైన సందేశ మనుగ్రహించిరా?

అష్టా—ఇదిగో వినుము.

గీ॥ అల్లునిమఖంబు, తీరమి ♦ యయ్యెమాకు
బాలుఁడవు, నీకుఁ గ్రొత్త భూ ♦ పాలనంబు
జనుల రంజించి కాంచు య ♦ శంబె ధనము
కంటెఁ బ్రాణంబుకంటె యో ♦ గ్యంబుమాకు॥

రాము——భాగ్యము.

గీ॥ దేశజనరంజనక్రియా ♦ దీక్షయందు
స్నేహమునుగాని, దయగాని ♦ స్వీయమైన
సౌఖ్యమునుగాని కడకు నీ ♦ జనకసుతను
గాని విడనాడుచో వెను ♦ కాడఁబోను॥

సీత॥——ఆహా! కావుననే యార్యపుత్రులు రఘువంశధురంధరులు—

రాము——ఎవరక్కడ? అష్టావక్రుని విశ్రమింపఁజేయుఁడు.

అష్టా——(లేచిపరిక్రమించి)ఓహో! చిరంజీవిలక్ష్మణుఁడరుదెంచినాఁడు. నేను విశ్రమింపఁబోయెదను. (నిష్క్రమించును)

లక్ష్మ——జయము జయమార్యునకు. నియమించినప్రకారముమీచరిత్ర మంతయుఁ జిత్రకారుఁడీపటమునఁజిత్రించినాఁడు. వినోదింపఁ గోరెదను.

రాము——వత్సా! మంచి సమయమునకే తెచ్చితివి. దేవిని వినోదింపఁ జేయువిధాన మెఱుంగుదువు. కథ యెంతవరకుఁజిత్రింపఁబడినది?

లక్ష్మ——ఆర్యురాలి అగ్నిపరిశుద్ధి

రాము——హా! పాపము శాంతించుఁగాక,

గీ॥ పుట్టువునుబట్టియే పరి ♦ పూతమైన
యీమహీజకు శుద్ధి వే ♦ ఱేమికలదు
అన్యములచేత శుద్ధిక ♦ ర్హంబులగునె
భవ్యతీర్థోదకముగాని, ♦ వహ్నిగాని

దేవీ! దేవయజనసంభవా! క్షమింపుము. ఈప్రవాదము యావజ్జీవితమైనది.

సీత——ఆర్యపుత్రా! మఱచిపోం డావిషయమును. రండు, పవిత్రమైన మీచరిత్రము చూతము.

లక్ష్మ——(చిత్రపటము విప్పి)ఇదియే యాచిత్రపటము.

సీత——(నిర్వర్ణించి) వీరెవ్వరు! ఆకసమునఁ గిక్కిఱిసినట్లు నిలువంబడి యార్యపుత్రుని స్తుతించుచున్నట్లున్నారు.

లక్ష్మ——ఇవియే సరహస్యములగుజృంభకాస్త్రములు, తాటకాసంహార సమయమున భగవానుఁడు విశ్వామిత్రుఁ డన్నగారికిఁ బ్రసాదించిన యాయస్త్రరాజము లివియే.

రాము——దేవీ! నమస్కరింపు మీయస్త్రరాజములకు. బ్రహ్మాదులగు మహానుభావులు వేనవేలువత్సరములు తపంబొనరించి, లోకహితార్థమై వీనిని సృష్టించిరి.

సీత——నమస్కారము దివ్యాస్త్రములారా!

రాము——దేవీ! ఈ యస్త్రములు సర్వథా నీసంతానము నాశ్రయించుఁగాక.

సీత——కృతార్థురాలను.

లక్ష్మ——చూడుఁ డిది మిథిలావృత్తాంతము.

సీత——ఓహో! ఎంతమనోహరము! ఇదిగో యార్యపుత్రుని సౌందర్యమూర్తి! అప్పుడే వికసించుచున్న నల్లగల్వఱేకుం బోలిన చామనచాయతో నున్ననై, చిక్కనై, బలిష్ఠమైయున్న యీ శరీరసౌభాగ్యమును ఱెప్పవేయక మానాయనగారు తిలకించి చూచుచున్నారు. ఆహా! అల్లారుముద్దారు పిల్లజులుపములతో నందగించు వదనారవిందమునం దామందహాసమేమి! అవలీలగా హరచాపమందికొని యెక్కిడుచున్నారు!

లక్ష్మ——

గీ॥ వీరె మీతండ్రిగారు గా • వించుచుండి
రనఁగు వియ్యంకులకు వసి • ష్ఠాదులకుఁ

దత్తదుచితప్రకార స ♦ త్కారవిధులఁ
దన పురోహితుఁడైన గౌ ♦ తమునిఁ గూడి॥

రాము—ఆహా! నేత్రోత్సవకరమైన దీవిషయము,

గీ॥ రఘు జనకవంశములకు నే ♦ ర్పడిన యిట్టి
యందమగు వియ్య మెవని కా ♦ నందమిడదు;
దాతయుఁ బరిగ్రహీతయుం ♦ దానె యగుచు
మనువు స్వయముగఁ గుశికనం ♦ దనుఁడు నడుపః

సీత—ఆహా! వీరా పెండ్లికొడుకులు మీానల్లు రన్నదమ్ములు. కలకల లాడుచున్నవి పెండ్లికళలు. ఆహా! ఆ ప్రదేశమందే, యా సమయమందే యిప్పుడున్నానా యేమి!

రాము—నేనును నట్లే యనుకొనుచున్నాను,

మ॥ అనురక్తిం బులకించి, లేఁజెమరువో ♦ యట్, గంకణశ్రేణి ఘ
ల్లనఁ గంపించుచునున్న నీచిగురుఁగే ♦ లాగౌతముం దూఁడి, రఘు
ల్లని నామై పులకింప, నాకరమునం ♦ దర్పించు నానాఁటిమో
హనదివ్యోత్సవ మిప్పుడున్ జరుగుచు ♦ న్నట్లే మనఁబూఁగెడున్॥

లక్ష్మ—ఈమె పెద్దవదినెగారు. ఈయమ చిన్నవదినె, మాండవి. ఇది మఱదలు శ్రుతకీర్తియును.

సీత—(చిఱునవ్వుతో) వత్సా! ఇది యెవ్వరు. ఇంకొకతె?

లక్ష్మ—(తనలో) వదినెగా రూర్మిళ నడుగుచున్నారు కాని దృష్టి మఱి యొకచోటికి మఱల్చెద. (ప్రకాశముగా) ఆర్యురాలా! చూడుఁ డీయన పరశురాముఁడు.

సీత—అమ్మయ్యో! భయమగుచున్నది.

రాము—ఋషిసత్తమా! నమస్కారము.

లక్ష్మ—ఆర్యా! చూడుచూడు, ఈయన మాయన్నగారిచే ...

రాము—(సాక్షేపముగా) సౌమిత్రీ! ఇంతకంటె వినోదింపఁదగిన విషయము లేదా చిత్రపటమున?

సీత—(సబహుమానముగాఁజూచి) ఇటువంటి వినయప్రభావముచేతనే యార్యపుత్రులు, మఱెంత శోభిల్లుచున్నారు.

లక్ష్మ—ఇదిగో మన మయోధ్యం జేరితిమి.

రాము—వత్సా! సౌమిత్రీ!

గీ॥ తండ్రిగారుండఁ దల్లు లెం ♦ తయును బ్రీతిఁ
గ్రొత్తగా బెండ్లియైన న ♦ ల్గురఁ గోమాళ్ళ
ముద్దుముచ్చటఁ గని పెంప ♦ మురియుచుండు
మంచిదివసంబు లవి యంత ♦ రించెనె కద॥

లక్ష్మ—ఇంక మంచిదివసంబు లెక్కడివి? ఇదిగో మంథర,

రాము— వేఱొకచో(దిలకించి) చూడు వైదేహీ!

గీ॥ శృంగిబేరపురంబు సే ♦ రంగఁ గనిన
యింగుదీపాదపం బిది ♦ యే లతాంగి!
దీనినీడనె పల్లెమ ♦ న్నినితోడ
మనకు లభియించె భవ్యస ♦ మాగమంబు॥

లక్ష్మ—(నవ్వుచుఁ దనలో) ఆర్యుఁడు కైకేయీ వృత్తాంతమును దాటవేసినాఁడు.

సీత—ఇది జటాబంధన వృత్తాంతము కదా!

లక్ష్మ—అవును. అమ్మా! ఆకాలమహిమ యెట్టిదో కాని,

గీ॥ ముదిసి ముప్పున రాజ్యసం ♦ పదల సుతుల
పరముగావించి, యిక్ష్వాకు ♦ ధరణిపతులు
కైకొనెదు పుణ్య మారణ్య ♦ కవ్రతంబు
చేకొనెఁగదమ్మ మాయన్న ♦ చిన్ననాఁడె॥

సీత—ఇదికదా, ప్రసన్న పుణ్యసలిలయగు భగవతి భాగీరథి.

రాము—తల్లీ! రఘుకులదేవతా! నమస్కారము. అరుంధతియుంబోలె నీవు నీకోడలికి సీతకు శుభం బొడగూర్తువుగాక.

లక్ష్మ—ఇక్కడనుండి భరద్వాజాశ్రమము మీఁదుగ మనము దక్షిణారణ్యము ప్రవేశించితిమి

సీత—ఇదిగో మనదక్షిణారణ్యయాత్ర; జరిగినది జరిగినట్లుగానే చిత్రింపఁబడినది. నా కెండపొడ సోకకుండుటకై, యార్యపుత్రులు నాతలపై నొక తాలవృంత మాతపత్రముగఁబట్టి నన్ను మెల్లన నడిపించుచున్నారు.

లక్ష్మ—అమ్మా! ఈప్రాంతముననే ప్రశాంతములైన తపోవనభూములు. చూడుఁడు, సెలయేళ్ల తీరములందలి తరుమూలముల నాశ్రయించి తపంబొనరించు వానప్రస్థుల చేతను, శమదమాన్వితులై, నిరంతరాతిథేయవ్రతనిష్ఠాగరిష్ఠులై, నీవార ముష్టింపచులై, స్వచ్ఛందజీవయాత్రం గడుపుకొను గృహస్థుల పర్ణశాలికలచేతను నీప్రాంతమంతయుఁ బ్రశాంతమనోహరము.

రాము—ఆహా! ఇది చూచునప్పుడా మునిపల్లెల జీవితములెల్ల నాకుఁ గన్నులఁ గట్టినట్లున్నవి,

సీ. కలసి నివ్వరిధాన్య ♦ ములు దంచు జడదారిపడఁతుల మేటి సు ♦ వ్వాలపాట
చిలుకలుం గోరవం ♦ కలు, పెద్ద లేతేర "ఆస్యతా" మను స్వాగ ♦ తానువాద
మేకాఱుఁ జీఱు వోక ♦ పూసిఫలించు స్వచ్ఛందతరులతా ♦ సంచయంబు
బ్రహ్మవిద్యాగ్థతా ♦ తపశ్చర్యాధీన పరమర్షి గంభీర ♦ భావ గరిమ
గీ. తులసిబృందావనమునుండి ♦ మలయుచుండు వలపుఁజల్లనిగాడ్పుల ♦ వైభవంబు
తలఁచికొనినంత మేనెల్లఁ ♦ బులకరించు సౌఖ్యములకెల్ల మునులయాశ్రమములెల్ల॥

సీత—ఆహా! ఈప్రదేశం బెంతతడవు చూచినను దనివిదీరకున్నది

లక్ష్మ—ఇక్కడఁదిలకింపుఁడు. దండకారణ్యమధ్యస్థమగు ప్రస్రవణపర్వత మిది. నిరంతరము వర్షించుచుండు నీరంధ్రమేఘసంఘాతముల సంయోగముచే సాంద్రీకృతశ్యామలవర్ణములై దీని శిఖరాగ్రములు విరాజిల్లుచుండు; దట్టముగఁ బెనవైచికొని,

పుంజీభవించియున్న తరులతానికుంజములచే, నిరంతరస్నిగ్ధశీతల శ్యామలంబగు నీకాంతార పర్యంతభాగములలో గోదావరీ స్రవంతి ప్రవహించుచున్నది. ప్రపాతసంవేగమువలనఁబరస్పరా స్ఫాల్యమానములగు, నేతత్తరంగిణీసముత్తుంగ తరంగసంఘముల రొదలతో నీపర్వతకందరము లెడతెఱపిలేక ప్రతిధ్వనించుచుండును.

రాము—నెచ్చెలీ! ఈప్రాంతమునఁ గొంతకాలము నివసించి, మన మెంతయుల్లాసముగఁ గాలము గడిపితిమో స్మరణకు వచ్చుచున్నదా? ఈసీమయందికుఱ్ఱ నానావిధరుచ్యఫలాహారంబుల సేకరించికొనివచ్చి మనల సేవించుచుండెడివాఁడు. మంజులతాంతలతానికుంజములతో మనోరంజకములగు గోదావరీనదీకూలములు మనవిహారముల కనుకూలము లగుచుండెడివి. (రహస్యముగా) చూడు, ప్రేయసీ జ్ఞప్తియున్నదా!

మ. లలిలేఁజెక్కునఁ జెక్కుసేర్చి, మెలమె ♦ ల్లన్ దాఱుమాఱైన ప
ల్కుల నేమేమొవచించుకొంచుఁ,దమిఁ గేలుంగేలునొ ♦ డ్డొంటఁ గౌఁ
గిలి నిండారఁగ దిద్దికొంచు ననుర ♦ క్తిం దేలుచో నేమనం
గలనారాతిరియేగతించెఁదెలియం ♦ గారాని యామంబులన్.

సీత—మనోరమణా! అరణ్యమందున్నను మనము సౌఖ్యముగనే కాలము గడిపితిమి, రాజధానియందింత నిరాకులమగు సౌఖ్యమెక్కడిది? చూడుఁడు,

సీ॥ దొరకునా! యిచ్చటి ♦ దోరఁబండిన రేఁగుఁబండ్ల శేషంబు, నీ ♦ వారభుక్తి
కలుగునా! చేతిమేఁ ♦ తలఁ బెంచి మచ్చిన వనకురంగీస్నేహ ♦ వైభవంబు
చేకూడునా! తప ♦ స్వినులాదరముతోడ సారెఁబెట్టిన మేలి ♦ నారచీర
మరల లభించునా! ♦ మనకు గోదావరీ పులినహంసాంగనా ♦ విలసనములు
గీ॥ బుజములనలంతి బిందెలఁ ♦ బూని, పాఱుటాపఁ బైటలు దడియ, ము ♦ ద్దారుదల
దబిసికన్నెలు పాదులం ♦ దదుపునీటి మధురనిగమార్గ గీతిక ♦ ల్మౌఱపుగను నేని

లక్ష్మ—అమ్మా ! ఇదిపంచవటి. ఇదిగో శూర్పణఖ.

సీత—అయ్యో ! ఆర్యపుత్రా! ఇంతవఱకేకదా మిమ్ముఁ గలిసియుండు భాగ్యము నాకు.

రాము—ఓసి వియోగభీరూ ! ఇది చిత్రపటము,

సీత—ఏమైనను దుర్జనుఁడు, దుఃఖమునే కలిగించుఁగదా?

లక్ష్మ—అమ్మా ! అందాశ్చర్య మేమున్నది ?

మ॥ మునుమాయామృగకైతవంబున, దురాత్ముల్ రక్కసుల్ మాకొన
ర్చిన ద్రోహంబుఁబ్రతిక్రియన్ గడిగినన్ ♦ జేయన్ మనోబాధ నూ
తనమై, యాతటి శూన్యమైతగు జన ♦ స్థానంబునం గుందునా
ర్యుని శోకార్తికి, ఱాయియున్ గఱఁగితీ♦రున్ వజ్రమున్ భిన్నమా॥

సీత—హా! రఘుకులానందా! మందభాగ్యనైన నానిమిత్తమై యంతటి సంతాప మనుభవించితిరి గదా!

లక్ష్మ—(కన్నీటఁదోఁగు రాముఁనింగాంచి) ఆర్యా!ఏమిది చిత్రపటదర్శన మాత్రముననే మీరును మనోవైకల్యముఁ జెందుచున్నారు!

రాము—వత్సా! సౌమిత్రీ! ఈవృత్తాంత మట్టిది; ఎఱుఁగనివాఁడవు కావుగదా,

చ॥ ప్రియజనవిప్రయోగమునఁ ♦ బేర్చిన యప్పటిశోకవహ్ని, త
ద్దయు భరమయ్యు నోర్చితిఁ గ ♦ దా యెటులేఁ బగదీర్పనెంచుని
శ్చయమున; నేఁ డదే మరల♦స్వాంతమునన్ సెలవారి దుస్సహం
బయి పరిపక్వమైన వ్రణ ♦ యవ్రణమ ట్లొనరించు వేదనన్॥

సీత—అయ్యో! ఏమిసేయుదు.దుర్భరవిరహాభావమున మునింగినేనిప్పు డార్యపుత్ర శూన్యురాల నై పోయితినే.

లక్ష్మ—(స్వగతము) ఓహో! ఏరిచిత్తవృత్తుల నన్యథా మఱలింప వలయు. (ప్రకాశముగా) అమ్మా! ఇటుఁజూడుము. మన్వంతర వృద్ధుని జటాయుని పరాక్రమోదంత మిది.

సీత—(చూచి) హా తండ్రీ! ఆపన్నురాలి నన్నురక్షించుటకుఁ బ్రాణములఁగూడఁ దృణప్రాయముగ విసర్జించి,నీయపత్యవాత్సల్యము వెల్లడించితివి కదా,

రాము—నాయనా! కాశ్యపా, తీర్థభూతుఁడగునీయట్టిమహానుభావుఁడు మాకు మాఱల లభించునా?

లక్ష్మ—అమ్మా! యీమెయే "శ్రమణ" యను సిద్ధశబరి.

సీత—తల్లీ శబరీ! ఎంతపుణ్యాత్మురాలవు; నాఁడుఁ నిన్నుఁ జూచు భాగ్యము లేకపోయినను నేఁడు చూడఁ గల్గితిని.

రాము—దేవీ! ఈశబరిమాటఁ దలంచిన నాహృదయ ముప్పొంగును. చూడు మెట్లున్నదో!ఆహా ఆవినయము,ఆయాదరణము, ఆభక్తి ప్రపత్తి, ఆ యతిథిపూజాతాత్పర్యము, వాచామగోచరములు. పాపము మాకొఱకై శ్రమపడి వింతవింత యోగిరములెన్నెన్నో సంతరించినది ఎందులకో,

సీ॥ అలసుఁ గన్నీటి చు ♦ క్కలు చాలవనియేమొ, పానీయమున నర్ఘ్య ♦ పాద్యమొసఁగె
అరమోడ్పుఁగను మొగ్గ ♦ లలరింప వనియేమొ, విరియు మెత్తని కమ్మ ♦ విరులు సల్లె
పలుకరాపడి తడం ♦ బడ లోపమనియేమొ, తేటిన మంచి పూ ♦ దేనెఁగూర్చె,
భావంబు పైకి నే ♦ గ్పడ నేరదనియేమొ, యుపహారఫలము లె ♦ న్నోయిమర్చె,
గీ॥ ఎదురువడి,దోయిలించి,నా' ♦ యిడినవిందు। గొనుము శ్రీరామ! తరియింతున' ♦ నుచు శబరి
యట్టె పరవశయై నిల్చి ♦ నట్టె నిలిచె। నాగగించితి నపుడు, నో ♦ రూర నిపుడు॥

లక్ష్మ—ఈతఁడు మహానుభావుఁ డార్యుఁడు హనుమంతుఁడు.

సీత—ఆహా! చిరకాలమునకుఁ గంటిని చిరనిర్విణ్ణమైన జీవలోకము సముద్ధరించిన యీపరమోపకారిని,

రాము—గీ॥ అంజనానందవర్ధనుం ♦ డైన యితఁడు
బాహుశాలి, శుభక్రియా ♦ దోహలుండు
ఇతని శౌర్యంబునఁ గృతా ♦ ర్థత ఘటిల్లెఁ
గలికి; మానకును నెల్లజ ♦ గంబులకును.

సీత—వత్సా! ఈకొండపేరేమి,విరియంబూచినకడిమి చెట్టుపైమయూర దంపతులు, తాండవించుచున్నవి. శరీరలావణ్యకాంతి ధూళి ధూసరితంబైయున్నను, సహజానుభావసౌందర్యమాత్రమున గుర్తింపఁదగి, ముహూర్తమాత్రము మూర్ఛిల్లియున్న యార్య పుత్రుఁడు నీచేతులందున్నట్లు లీచెట్టునీడను జిత్రింపఁబడియె!

లక్ష్మ—

ఉ॥ తావులు మద్ది క్రొవ్విరుల • తావుల తావలమై, నవాంబుద
ప్రావృతనీల శృంగమగు • నాగిరి మాల్యవదాఖ్య మమ్మ!

రాము—

వత్సా! వినఁజాల దుర్భర మి ♦ తఃపరగాథలు, చాలుఁ జాలు, సీ
తావనితావియోగ పరి ♦ తాపము దాఁపరమయ్యెఁ గమ్మఁటన్॥

లక్ష్మ—విరమించెదను. కథ యింకను మిగిలియున్నది; కాని ఆర్యురాలు కడునలసటఁజెందిన ట్లున్నది. కొండొక విశ్రమింతురు గాక.

సీత—ఆర్యపుత్రా! ఈ చిత్రపటదర్శనముచే నాకొక యభిలాషము వొడమినది. విన్నవించుకొందునా ?

రాము—అదియేల? ఆజ్ఞాపింపుము.

సీత—ప్రశాంతములగు తపోవనవాటికల విహరించుచు, మునిపత్నుల తోడ భాగీరథియందు జలకము లాడవలయునని,

రాము—వత్సా! ఈమెకోరిక వెంటనే చెల్లింపుమని గురుజన మిప్పుడే కదా సందేశించినది? కుదుపులేకుండ సుఖముగా బ్రయాణము చేయఁదగిన రథము సిద్ధముచేయుము.

లక్ష్మ—చిత్తము. (అని నిష్క్రమించును.)

రాము—ప్రేయసీ!రమ్ము.ఈ వాతాయనముకడ నొకింత విశ్రమింతము.

సీత—ఔను అలయికచే నిద్దుర తూఁగుచున్నది.

రాము—ఆలాగైన నన్నాఁదిమఱచినదువుము.(అనిచేయినంది)ఓహో! చిత్రపటముం జూచినబడలికచేతను,వియోగసంభ్రమముచేతను గాఁబోలు ముచ్చెమరువోసిన దీబాహులత;నాకంఠమున నర్పింపుము, (సీతబాహువుఁదనమెడపైవై చికొని)చంద్రకరస్పర్శముచేఁజెమ్మగిల్లిన చంద్రమణి హారమువలెఁ జల్లనై...ఆహా మనోహారిణీ; నీబాహులతాసంస్పర్శముచే నాశరీర మమృతవిలేపన మందినట్లున్నది. అనిర్వచనీయమగు వికారమేదియోం యావిర్భవించి, నన్నాకస్మికమూర్ఛాపారవశ్యమున ముంచి మఱల నుజ్జీవింపఁజేయుచున్నది. ఇదినిద్రయో లేక సమ్మోహాపారవశ్యమో!

సీత—మనోరమణా! మీహృదయము నిరంతరము నాయందు సుప్రసన్నమైయుండును! ఇంతకంటె నేఁగోరఁదగిన సౌభాగ్యమేమున్నది ?

రాము—

గీ॥ ప్రణయమధురంబులైన నీ ♦ భాషణములు
వాడువాఱిన జీవన ♦ ప్రసవములకు
వికసనమ్ము, లింద్రియమోహ ♦ విభ్రమములు
శ్రవణపేయంబులు, మనోర ♦ సాయనములు.

సీత—ఆర్యపుత్రా! ఇందువలననే మిమ్మందఱు ప్రియంవదు లందురు. ఇఁక శయనింతును.(అని శయ్యకొఱకునటునిటు వెదకుచున్నది.)

రాము—ప్రేయసీ! ఏమి వెదకుచున్నావు? ఇదిగో,

చ॥ కలనయినన్ బరాంగనకుఁ ♦ గాక, వివాహమె యాదిగా భవ
ల్లలిత తనూపలాలన వి ♦ లాసరసానుభవ ప్రశస్తమై
చెలువ! గృహంబునన్ గహన ♦ సీమల నిన్నుచితంపుసేవలన్
గొలిచెడి రామబాహు విది ♦ గో! తలదిండగు నీకు జానకీ!॥

సీత॥-కృతార్థురాలను (రామబాహువుఁదలగడగా నిడికొనినిద్రించును.

రాము—ఏమిది! ప్రియంవద కప్పుడే నిద్రవచ్చినదా యేమి!(స్నేహమున మేను నిమురుచు) ఆహా ! అనుకూల్యవతియగు నిల్లాలివలని సౌఖ్యమున కంతయని విలువ యెక్కడిది?

ఉ॥ ఈమహీశాలలామము గృ ♦ హేందిర; కన్గవ కీమెమూర్తి ది
వ్యామృతవర్తి, స్పర్శసుఖ ♦ మా! హరిచందనచర్చ మేని, కీ
కోమలిబాహువల్లి మెడ • కుఁ వలిముత్తెసరమ్ము, రమ్యమే
యామది కేలదీయము స ♦ మస్త, మహో విరహంబు దక్కఁగన్॥

(ప్రతీహారి ప్రవేశించి) దేవా! వచ్చినాఁడు.

రాము—ఎవరు ?

ప్రతీ—ఏలినవారి పాదసేవకుఁడు దుర్ముఖుఁడు.

రాము—(తనలో) శుద్ధాంతసంచారి నీదుర్ముఖుని పౌరజానపదులపై వేగు నడుపుటకు నియమించితిఁగదా.( ప్రకాశముగా) రమ్మనుము.

(ప్రతీహారి నిష్క్రమించును)

దుర్ముఖుఁడు—(ప్రవేశించి) అయ్యో! రాణిగారినిగుఱించిన యవాచ్యమగు నీజనాపవాదమును దేవర కెల్లుమనవి చేయుదును తప్పదు. ఈదౌర్భాగ్యుని యుద్యోగ మట్టిది.

సీత—(నిద్దురలో) అయ్యో! ఆర్యపుత్రా !ఎక్కడనున్నావు!

రాము-ఓహో!చిత్రపటవీక్షణమువలని సంక్షోభకారణమగు వియోగభావమునే కలవరించుచున్నట్లున్నది. అవును ప్రేముడికిది నైజమే.

శా॥ ఏ దద్వైతము ఖేదమోదముల, నెం • దే హాయిఁజెందున్ మనం,
బేదా నన్నిటఁ దోడునీడ, ప్రియ మెం ♦ దే పోదు ప్రాయంబుతో,
నేదా నావరణాత్యయప్రబలమై హృ♦ద్యంబొగిన్ ప్రేమ సాం,
పా దాంపత్యశుభానుభోగమె కదా ♦ యాసింతు రెట్లేనియున్॥

దుర్ము—దేవా! జయము

రాము—దుర్ముఖుఁడా! నేఁటి విశేషములేమి?

దుర్ము—ఏమున్నవి, చల్లనియేలుబడిచే శ్రీరామచంద్రులు తమ తండ్రి గారినిగూడ మఱపించుచున్నారని పౌరులు వేనోళ్ళ మిమ్ముఁగొని యాడుచునే యున్నారు.

రాము—ఇది కేవలశ్లాఘావాక్యము. లోపములమాట చెప్పుము. నిన్ను వేగుబంపినది నాగుణకీర్తనము వినుటకుఁ గాదు.

దుర్ము—దేవా! నోట వక్కాణింపనేటికి? సర్వ మీపత్రమునఁ జూచి కొండు. (కాఁగితమిచ్చును.)

రాము—(కాఁగితమందుకొని ఈవలకరుదెంచి)ఈపత్రంబున నెట్టివిశేష మున్నదో! ఇతఁడు నోటవక్కాణించుటకే సంశయింప నేటికి? ఇదేదియో మహానర్థము కానోపు. (అని లోపలఁ జదువుకొని) హా! హా! హతోస్మి. (మూర్ఛిల్లును.)

దుర్ము—దేవా! ఉపశమింపుఁడు.

రాము—(మూర్ఛఁదేఱి)దుర్ముఖా!ఎంతఘోరమిది! ఇంతటి వైపరీత్యము గూడఁ బ్రపంచమునఁగలదా? అనన్యకన్యాసామాన్యమైన జన్మ ముచేతనే పరమపవిత్రమైన యీజానకీచరిత్రమునకా యీనీచ ప్రవాదము! అయ్యో, ఇంతకంటె నా కాకస్మికనిర్ఘాతపాతము మేలే! హాలాహల జ్వాలామాలికలచే భస్మీకరింపఁబడుట మేలే, హా! హా! చిరకాలపరగృహావాసముచే లోకులీ సీతంగుఱించి, యన్యథా భావింపక మానరని, లోకాతీతములగు నద్భుతోపాయముల నెంత యుపశమింపఁ జేసినను, గడకు రావలసిన యాలేఁతమాట యెట్లోరాక తప్పినదికాదు. హా! హతవిధీ! ఇప్పుడేది కర్తవ్యము (విమర్శించి) ఆహా! ఈరాముని జీవయాత్రయం దింతకంటెఁగఠోరమైన విషమావస్థ యుండునా? మఱియు నేయుపాయముచేఁ బ్రజాసమూదాయమును సమాధాన పఱుపఁగలను? (ఆలోచించి నిర్ణయముతో) ఇంక నొక్కటియే యుపాయము. (దుఃఖముతో) హా! జానకీ!

పవనమహీనందనీ ! (అని దుఃఖ మడంచుకొని) ఛీ! ఇప్పుడు దుఃఖమునకవకాశములేదు. ఎట్టి గాఢప్రయత్నములతోనైనను, బ్రజారాధనదీక్షం గాపాడుకొనుటయేకదా యిక్ష్వాకురాజ ధర్మము. అందునకేకదా తండ్రిగారునన్నును గడకుఁ దన బ్రాణములఁగూడఁగోల్పడినది. వసిష్ఠభగవానులునాకీవిషయమైసందే శించిన దిప్పుడేకదా ? జగదేకస్తుతిపాత్రులగు హరిశ్చంద్రాది నరేంద్రుల సాధుప్రవర్తనముచేఁ బరమపవిత్రమగు సావిత్ర వంశ చారిత్రమునకు నామూలమున నేఁడేమేని కళంక లేశము సంభవించినచో ఛీ ఛీ నాజన్మము కాల్పనా? హా దేవీ! హా! పవనమహీతనూభవా ! స్వజన్మానుగ్రహపవిత్రితవసుంధరా! హా ! నిమిజనకవంశవర్ధనీ ! హా! పావకవసిష్ఠారుంధతీప్రశస్తశీల శాలినీ ! హా ! రామనుయజీవితా ! హా మహారణ్యావాసప్రియ సఖీ ! హా ప్రియప్రోకవాదినీ ! ఇట్టి నీకా; ఈ యవస్థాపరిణా మము. హా జానకీ ! లోకములన్నియు నీవలన సుశ్లోకములగు చున్నను నీవు మాత్రము లోకములకుఁ గాకపోయితివిగా!

గీ॥ పరమ సాధ్వీత్వ సామ్రాజ్య ♦ పట్టమంది
ముజ్జగము లేలుచున్న యో ♦ ముద్దరాల!
పాపివిధిచేత మిథ్యా ప్ర ♦ వాదమంది
యనదవై దిక్కుమాలి య ♦ ల్లాడ వలసె॥

(అని కాగితముపై నేమియోవ్రాసి) దుర్ముఖా ! నీవు పోయి మీ యాక్రొత్తరాజునీకీయాజ్ఞాపత్రమునుబంపినాఁడనిలక్ష్మణునకిమ్ము.

దుర్ము—దేవా ! దుర్జనుల వాక్కులు లెక్కఁగొని, పవిత్రరఘుకుల సంతానమును మోసియున్న యగ్నిపరిశుద్ధురాలగు దేవిగారియెడ నేమో ఘోరనిర్ణయము సంకల్పించినట్లున్నారు?

రాము—పాపము శాంతించుఁగాక ! దుర్ముఖా ! నా ప్రజలు దుర్జను లనవచ్చునా?

గీ॥ ప్రజల కభిమాన మిక్ష్వాకు ♦ వంశమనిన
విధివశత నందె నిందర్క ♦ బీజ మొదవె
అగ్ని పరిశుద్ధిఁ జేసితి ♦ మంటిమేని
అగుననుచు నమ్మ దూరవ్వ ♦ త్రాంత మెవఁడు ?॥

దుర్ము—హా! దేవీ! (దుఃఖముతోఁ బోవును.)

రాము—హా హా! కఠోరము రాజధర్మము అయ్యో బేలా! జానకీ;
నాపై నెంతపేరాసగొంటివి. ఎంత మురియుచుంటివి.

సీ॥ పనికత్తె లెందఱు ♦ న్నను బైఁటచెఱఁగునఁ దుడిచి పాదుకలీవె ♦ దొడిగినావు
ఉపచార మెప్పుడే ♦ దోయుంచు నేమఱి కెలమినామనసులో ♦ మెలఁగినావు
మురిపెంపు రాచకూఁ ♦ తుగవయ్యు ననుఁగూడి యడవికాఁపురమొ ♦ నడిపినావు
రాసి యంపానఁ గా ♦ రాదు రక్కసు ధిక్కరించి యాలువు నిల్వ ♦ రించినావు
గీ॥ ఇట్టినినుఁ జిచ్చులం ద్రోసి ♦ నట్టి నాదు నేఁ డొకలెక్కయనక మ ♦ న్నించినావు
ఎంతమురిసితి వింతిగా! ♦ యేమిఫలము కన్నగుట్టైను విధికి నీ ♦ కాఁపురంబు॥

నెచ్చెలీ! కడగండ్లన్నియుఁ దొలఁగినవి కొంతకాలమునుండియైన సుఖించుచుంటిమని సంతసించుచుండ నింతలో నిట్టియుపద్రవము సంభవింపవలయునా? అంతయైననులోకము నీయెడ నవిశ్వాసమే వహింపవలెనా? కానీ జనకనందినీ! నీసదాచార మెవ్వరు విశ్వసించినను విశ్వసింపకున్నను, బరమపవిత్రములగు నీచరణాంభోజములంటి వచింతు నిదిగో,

శా॥ నే నావంతయు నీసుశీలతకు సం ♦ దేహింప, నిన్గూర్చి యే
మేనిఁ గీడనుకొన్న నాకు నరకం ♦ బే జన్మజన్మాల క
య్యో నాజీవమణీ! యన్వయద్విలయ మెం ♦ తో పావనంబయ్యె నీ
చే, నట్లయ్యుఁ బ్రవాదమిట్టిది జనిం ♦ చెఁ నాదునిర్భాగ్యతన్ ॥

ఇంక నేమిప్రయోజనము ? క్రూరకర్ముఁడనై భీభత్సకార్య మొనరించితి.

ఆ వె॥ చిన్ననాఁటనుండి ♦ పెంచినప్రియురాలిఁ
బారవులేని ప్రేమ ♦ పూర్ణురాలిఁ

గ్గైతవమున మిత్తి ♦ వాత వేయుచునుంటి;
చెనఁటిమొలుక యింటి ♦ చిలుక నట్లు॥

చాలు నింకేటికిఁ బాపకర్ముఁడనైన నేను స్పృశించుచు దేవిని నపవిత్రపఱుపవలయును?

ఆ॥ వె॥ చను మపూర్వకర్మ ♦ చండాలు ననుఁ బాసి
యంటఁబోకు ముద్ద ♦ రాల! నన్ను
ఆశ్రయించినావు ♦ హరిచందనభ్రాంతి
విలయమూలమైన ♦ విషకుజంబు॥

అయ్యో; జానకీ! పరమనీచమైన యీరామునిపాణి నేదుర్ముహూర్తమున గ్రహించితివో కాని నీకాఁపురమంతయునిష్ఠురములగు కష్టములతోడనే కడముట్టుచున్నది. కానిమ్ము, ఇట్టిప్రేమానుబంధమునకు వియోగమే రస్సైకస్థానము. హా! హా! జీవలోకమెంతలో విపర్యస్తమైనది. నేఁటితో రామునిజీవయాత్రనిష్ప్రయోజనమైనది. ప్రపంచము శూన్యమై జీర్ణారణ్యమైపోయినది. దుస్సహ దుఃఖానుభవముననే రామునిశరీరము చైతన్యశూన్యముగాకున్నది. వజ్రమయశస్త్రికలై హృదయమర్మములఁ గఱకఱంగోయుచు నీమొండిప్రాణంబు లింకను రాలిపోకున్నవికదా! హా అంబా అరుంధతీ! హా భగవానులారా వసిష్ఠవిశ్వామిత్రులారా! హా దేవీభూతధాత్రీ! హా మామా జనకరాజేంద్ర! హా లంకాధిపతీ విభీషణా! హా ప్రియసఖా! సుగ్రీవ! హా సౌమ్య అంజనాతనయా! హా సఖీత్రిజటా! మీరందఱు శ్రీరామహతకునిచేఁ బరాభూతులైపోయితిరి. ఛీ! కృతఘ్నుఁడను నేను వారింబేర్కొనుటకైన నర్హుఁడనా,

శా॥ బాల్యంబాదిగ నెల్లప్పుడు నమ్మి యురస్థలిన్ నిదురమై ♦ పన్నుండు ప్రేమంపుటి
ల్లాలిన్ నాదు గృహేందిరన్ బ్రసవవే ♦ లాలోలయా నిండుచూ
లాలిన్ హా!దయమాలినేఁడు బలిగా♦ నర్పించుచుంటిన్ మహా
త్తాలాభీల కరాళకానన కిరా ♦ తవ్రాత మధ్యంబునన్ ॥

(తెరలో) అబ్రహ్మణ్యము అబ్రహ్మణ్యము.

రాము—(ఆకర్ణించి) ఎవరక్కడ ఆగగ్గోలేమో తెలిసికొనుము.

(నేపథ్యమున)

గీ॥ యామునీయతటంబులం ♦ దత్యుదగ్ర
తపము గావించుకొను తపో ♦ ధనులు వారు,
క్రూరలవణాసురుని బారిఁ ♦ గుతిలపడుచు
దేవ ! నీప్రాపుఁ జేర నే ♦ తెంచినారు॥

రాము—(కోపముతో) ఏమి ఇంకను రాక్షసభయమా ! ఇదిగో దురాత్ముఁడగు నాకుంభీనసపుత్రుని సంహరించుటకు మాశత్రుఘ్నుని బంపుచున్నాను. (కొన్నియడుగులు పోయి మఱలి) హా! దేవి ! ఏమి కానున్నావో, నిన్నెవ్వరి కొప్పగింతును. భగవతీ! భూదేవీ! నీ వేనీ కాన్పునరక్షించుకొమ్ము. (నిష్క్రమించును.)

సీత—(కలలో) హా ! ఆర్యపుత్రా ! హా సౌమ్య ! (దిగ్గునలేచి) ఆర్యపుత్రవిరహముచే నల్లాడుచున్నట్లు లెంతపాడుకల గంటిని! (అటు నిటుఁ జూచి) హా ! హా ! నిద్రవోవుచున్న నన్నొక్కదానిం జేసి యార్యపుత్రుఁడు వెడలిపోయెనా ? కానీ ! చేతనైన చోఁగోపించెదను. ఎవరక్కడ !

దుర్ము—(ప్రవేశించి) "అమ్మా ! రథము సిద్ధముచేసితిని, ఆరోహింతురుగాక" అని కుమార లక్ష్మణులు విన్నపింపుమనిరి.

సీత—(ఆలోచించి) ఇదిగో వచ్చుచున్నాను. రఘుకుల దేవతలకు నమస్కారములు. తపోధనులకభివందనములు.

(అందఱునిష్క్రమింతురు.)

ప్ర థ మాం క ము.

సంపూర్ణము.

---



శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఉత్తర రాఘవము.

## ద్వితీయాంకము.

(అరణ్యమున సూతచోదితమగు రథముపై సీతయు, లక్ష్మణుఁడును బ్రవేశింతురు.)

సూత — అమ్మా! రథము నడుకానలోఁ బ్రవేశించినది. ఇది మిట్ట పల్లముల దారి హెచ్చరిక.

సీత — ఆర్యా! రథ మాపుఁడు. కుదు పెక్కువగ నున్నది. కొంతదూరము నడిచెదను. సౌమిత్రీ! దిగుము (అందఱు దిగుదురు.)

లక్ష్మ — సూతుఁడా! నే మఱలివచ్చునంతలో గుఱ్ఱములఁ గడిగ మేఁపుకొనుచుండుము. అమ్మా! మెల్లఁగ దారి చూచి నడువుము. (నడుచుచుఁ దనలో) గమ్యస్థానము చేరువఱకు నీయమ కేదే నొకముచ్చటఁ జెప్పుచుండవలయు. (ప్రకాశముగా) అమ్మా! చూడుము. ప్రకృతిరమణీయమైన యీయరణ్య సౌభాగ్యము పరిచితులమగు మనకే యెంత వింతగనున్నదో?

సీ॥ తఱచుగానల్లి కిరి ♦ క్కిఱిసి, చీఁకటులీను తరువల్లికల పర్వ ♦ తముల చఱులు
చఱుల వెంబడిసన్న ♦ జాలులై ప్రవహించు నిసుక దేఱిన సెల ♦ యేళ్ళగములు
సెలయేళ్ళ యిరుగెలం ♦ కుల గోవజవ్వాది బుగబుగ ల్వెలయించు ♦ పొదరుటిండ్లు
పొదరుటింటనుఁ జెంచు ♦ పూఁబోండ్లు పిల్లనగ్రోవులం బాడు మే ♦ ల్కొలుపుఁబాట

గీ॥ పాటనాలించి పరవశ ♦ త్వమున మేఁతమాని వీనులనిక్కించి ♦ భ్రమనుపడుచు
లేళ్లు నిలబడు పచ్చిక ♦ బీళ్ళకలిమి నద్భుతావహమీయర ♦ ణ్యంబు సృష్టి॥

సీత—సామిత్రీ! నామనసు చిన్నపోవునేమోయని, యడిగినదేతడ వుగా మీయన్నగారు నాప్రయాణమున కంగీకరించిరి. కాని బయలుదేఱు నప్పటి నుండియు నొకటిపై నొకటిగా దుర్నిమిత్త ములే నాకుఁబొడగట్టుచున్నవి మఱియు

గీ॥ సృష్టిలో నేది గనుగొన్న ♦ నేది విన్న
నాత్మ, భయసంశయముల న ♦ ల్లాడఁజొచ్చె
నేఁడదేమొ చెలంబడ్డ ♦ నాఁడువోలె
మనసు చెయివెట్టి కలఁచిన ♦ మాడ్కి నుండె॥

లక్ష్మ—(స్వగతము) పాపమీమంద భాగ్యురాలికి రానున్న దురవస్థ యీదుర్నిమిత్తములవలననే సూచితమగుచున్నది. ఈయమసంశ యములకు నేనేమనిపరిహారములు చెప్పఁగలను. (ప్రకాశముగా) అమ్మా! ఈశకునము లొక్కొక్కతఱిఁగా కతాళీయముగ సరిపోవు నవి, వీనితోనేమి.

సీత— వత్సా! నీవెంతధైర్యము చెప్పుచున్నను నామదికేమియు సమా ధానముగాలేదు. ఈప్రయాణము నాకెంతమాత్రము సంతో షాస్పదముగలేదు. ఇక్కడనుండి పురంబునకు మఱలిపోవుటయే మేలు రథం బింక మఱలింపుము.

లక్ష్మ—(స్వగతము) అయ్యో! నాకిప్పుడేది తెరువు!

గీ॥ అరదమునుఱల్పనన్ను భ ♦ యార్త యగుచు
వేఁడికొను జానకిం జూచి, ♦ విభునియాజ్ఞ
దలఁచుకొన్న; రథంబు ముం ♦ దరిగాని
పిఱిఁదికింగాని నడిపింప ♦ వెఱచుమనసు॥

రాజాజ్ఞ నేకారణమునఁగాని యుల్లంఘింపరాదుగదా. (ప్రకా శముగా) జానకీదేవీ! దిగులొందినకొలందిడెందమున కేఁ యో పాడు తలంపులూరుచునేయుండును. హృదయము కుదురుపఱచు కొనుము

సీత—వత్సా! సౌమిత్రీ! నిర్నిమిత్తంబుగ నాచిత్తమున కిట్టి పరితాపము కలుగుట కేమికారణమో తెలియకున్నది. అవస్థలంబడి చెడి యున్న ప్రాణము గావున నేమాత్రము మనసు చివుక్కుమన్నను వెనుకటి నాదురవస్థ స్మరణకు వచ్చుచుండును. నాయనా! ఋష్యశృంగాశ్రమమునుండి మఱేమియు వార్త వచ్చియుండదుగదా. ఇంతకు నేను బయలుదేఱునప్పటి కార్యపుత్త్రుఁడు కొలువుకూటమందుండుటచే నొక్కమాఱు చూచినచ్చుట కవకాశము కలుగదయ్యెను. వత్సా! నీవు మీయన్నగారినిఁ జూచియే వచ్చితివిగదా? వారు క్షేమముగనున్నారా? చెప్పుము.

లక్ష్మ—దేవీ! యెవ్వరిక్షేమమున కేకొఱంతయు లేదు.

మ॥ అణఁగున్ సంశయమెల్ల, నల్లదె తరం ♦ గాభంగ గంగాతరం
గిణి; యాపొంత తపోవనంబు సవనా ♦ గ్నిద్యోతమానంబు, కా
రణదేహుల్ నిరవగ్రహుల్ నిగమతం ♦ త్రవ్యగ్రులౌ తాపసా
గ్రణు లచ్చో వసియింత్రు; వారల సప ♦ ర్యల్ నీకుఁ శ్రేయంబగున్॥

సీత—ఏమో కానిమ్ము. మిగిలివచ్చితిమి. మున్యాశ్రమదర్శనాభిలాషము నాకుఁ గలుగకుండినను బాగుండెడిది. ఆర్యపుత్త్రునివిడిచి నేఁటికప్పుడే రెండుదినములా? కానీ! ఆ కనఁబడునది యేనా భాగీరథి? వత్సా! రఘుకులదేవతయగు నీభాగీరథీజన్మమెంత పవిత్రమైనది.

లక్ష్మ—అమ్మా! ఒక్కజన్మమే యేల? ఈమెచారిత్రమంతయుఁ బవిత్రమే.

సీ॥ దేవదేవేశ్వర ♦ ధ్యేయమౌ హరిపాదకమలనాళము సూతి ♦ కాగృహంబు
పరమౌషధీలతా ♦ వాలమూలంబైన ప్రాలేయనగ ముగ్గ ♦ బాలకలశి
దరచంద్రచంద్రికా ♦ ధౌతనిర్మలమైన భవుజటాజూటంబు ♦ పడకటిల్లు
ప్రాజ్యమహీశ్వరయజ్ఞ ♦ వాటీపవిత్ర మార్యావర్తభూమి క్రీ ♦ డాంగణంబు

గీ॥ పరమపావనమైన జీ ♦ వనసమృద్ధి వెలయు యమునాతరంగిణి ♦ చెలిమికత్తె
ప్రబలరత్నాకరునితోడి ♦ బాంధవంబు పొగడఁదరమె వియన్నదీ ♦ పుణ్యచరిత॥

(సీతా లక్ష్మణులు నదీతీరమున కేగుదురు)

సీత—భగవతీ, భాగీరథీ! నమస్కారము. (నమస్కరించును)

లక్ష్మ—దేవీ; ఇనమింక నావలిదరికిఁ జేరుదము, అయ్యా! పల్లీ! మాకుఁ బడవ సిద్ధము చేయుము.

పల్లె—దొరా! దయచేయుండి, చిద్దంగానే వుంచుండి.

(సీతా లక్ష్మణు లవ్వలదరికిఁ జేరుదురు)

సీత—వత్సా; సౌమిత్రీ! మనము దారితప్పి పెడదారింబడలేదుగదా? నాకేమో భయమగుచున్నది. ఇక్కడ నెక్కడను జడదారుల యాశ్రమస్థలంబులజాడయే కనఁబడదు చూడు? పోను బోను నాధైర్యముతో పాటు ప్రొద్దుగూడఁ గ్రుంకుచున్నది. చెవులు చిల్లులువోవ నఱచు కీఁచురాళ్ల యలికిడిదక్క మానిసియలికి డియే గానరాదు.

సీ॥ మునిమాఁపు సందెవా • ల్పనకునై మిన్నేటిపాయ కేతెంచు తా • పసులుగాని
లేఁగదూఁడల మరల్ • రేగి యంభాయంచు సందెమళ్లెదు నాల • మందగాని
తెలియేటియిసుక, వె • న్నెలకుప్పలాడి, యిండ్లకుఁబోవు మునికుమా • రికలుగాని
కుశపత్రములఁగోసి • కొని, యొండొరులఁగెల్చుపరువులఁ జను పిల్ల • వటులుగాని

గీ॥ తిరి నలిగిన కాల్నడ • దారిగాని యిచటఁగనరాదు మునిపల్లె • లెంతదవ్వొ
మూసికొనివచ్చుచున్నవి • మొలకయిరులు నేమిటికివచ్చినపరియాణ • మిదిమఱంది॥

లక్ష్మ—తల్లీ! యిది నీకై నీవేకోరి తెచ్చి కొంటివి. చింతించుట యెందులకు? మున్యాశ్రమములు చూడవను భయమక్కఱలేదు. చేరువకే వచ్చితిమి.

సీత—అయ్యో సౌమిత్రీ! మనమంధకారమునఁ బడిపోవుదుమేమో

లక్ష్మ—అమ్మా! మనమేమి లోకమే యంధకారమునమునింగినది.

సీ॥ లోకబాంధవుని యా • లోకంబునకుఁ బాసి ప్రకృతి తేజోదరి • ద్రాణమయ్యె
నెఱసంజచిచ్చునం • దుఱికిఁ బెన్మిటితోడ ఛాయాపురంధ్రి యు • స్తంగమించె

కవఁబాసి పెంటిజ ♦ క్రౌవ దుస్సహవియోగమున నెలుంగెత్తి వా♦పోవుచుండె
తననాథుని ప్రవాస ♦ మునకు గాసిలి తేఁటియెలుఁగునఁ బద్మిని ♦ యేడ్చుచుండె

గీ॥ వీరిఁ గని గుండెనీరయి ♦ విపినరమయు విపులవిహగారవంబుల ♦ వెక్కివెక్కి
యేడ్చుచున్నది తల్లిరో! ♦ యెన్నఁదరమె కాలమహిమంబులో ♦ నెన్ని ♦ కళలుగలవొ

సీత—— ఏమి సౌమిత్రీ ! ఏమోయుపన్యసించుచున్నావు. నేఁడు మొదటి నుండియు నీవున్నవిధము నాకు మిక్కిలి శోచనీయముగా నున్నది. నాయనా ! ఎన్నఁడుగాని ప్రసన్నతంబాయని నీవదనం బిటు చిన్నవోవుట కేమికతమయ్యా ?

లక్ష్మ——(స్వగతము) అయ్యో! ఈ యిల్లాలికిప్పుడు నేనేమని సమాధానము చెప్పుదును. కర్ణకఠోరమైన శ్రీరామాజ్ఞ నీ సాధ్వీమణి కెట్లువచింతు. ఛీ! లక్ష్మణా! నీజన్మమెంతటిపాతకమునకు హేతుభూతమైనది. ఇంతకుమునుపే నీ జీవితమంతమైయుండరాదా?

(కన్నీరునించును)

సీత——(ఆతురతతో) ఏమినాయనా ! చెప్పుము, నీపరితాపకారణమేమో తెలిపి నాకు మనశ్శాంతి కలిగింపవా? కంటఁ దడి వెట్టుచున్నావు! ఎందులకు?

లక్ష్మ——తల్లీ ! నీకింకెక్కడి శాంతి.

సీత——నాయనా! అదేమోయీ అట్లనుచున్నావు? ఇంతటిదైన్యమున కేమి కతమో యెఱింగింపవేమి?

లక్ష్మ——ఉ॥ తెంపున నింతమూరమరు ♦ డెంచి రఘుప్రభునాజ్ఞనీకెఱింగింపకపోదునమ్మ పురి ♦ కిఁక ? వినుతల్లిరో! లోకనిందకుఁగంపిలి రామచంద్రుఁడు వ♦నంబులనిన్ విడిరమ్మఁటంచు నన్నంపె దురంతఘోరదురి ♦ తాళికిఁ జాలినవాఁడనోటచే॥

(అని సీతపాదములపైఁబడును)

సీత——హా ! రామచంద్రా! (మూర్ఛిల్లును)

లక్ష్మ—అయ్యో ! ఈయిల్లాలి కెంతటి దుర్వార్త వినిపించితిని. హా రాఘ వేంద్రా ! సౌశీల్యగుణాభిజాతయగు నీ సీతామహాదేవినిఁ జేతు లార నీ కీకారణ్యంబున డించి యీమె దురవస్థనంతయుఁ గన్నులారఁ జూచి యోర్చుటకుందగిన కటికమానిసిననియా నన్నే యీదుష్కార్యమునందు నియమించితివి ? అక్కటా! దుఃఖపారవశ్యముచేఁ గలిగిన యీమూర్ఛ యింక నెంతటి ముప్పునకుఁ గారణమౌనో గదా ? అయ్యో! దైవమా ! దిక్కుమాలిన యీరామకుటుంబిని నీవిపత్తునుండి దరిఁ జేర్చు వారులేరుగా! కానీ,

శా॥ నాచిత్తంబు పవిత్రరామపదచిం ♦ తాయుక్తమేనిన్, మనో
వాచాకర్మములందు ధర్మనిరతిన్ ♦ వర్తింతునేనిన్, ధరి
త్రీచక్రంబున "సత్యమేవజయ"తీ ♦ తి ఖ్యాతి నిక్కంబయే
నీ చూలాలి కపాయమున్ దొలఁగు గా♦కీ ఘోరమూర్ఛాగతిన్॥

సీత—(మూర్ఛనుండిలేచి) నాయనా ! ఇదేమి కలయా ?మునిపత్నులు జూచిరమ్మని కదా మీ యన్నగారు నన్నంపినది ?మాటాడ వేమి?

శా॥ అన్నా ! లక్ష్మణ! నిందయేమి, వనికి ♦ ట్లంపించు టేమీ, కలం
గన్నావో? కలఁతన్ వచించితివొ వ ♦ క్కాణింపు మింకొక్కమా
ఱిన్నిర్హేతుకదుర్వియోగము నిజం ♦ బే యైనచో నింక నే
నున్నా, నున్నదిగంగ చెంగటనె,యె ♦ ట్లో యోగ మట్లయ్యెడున్॥

లక్ష్మ—తల్లీ! ఆత్మహత్య యెంతేనిపాతకము. అందున వీరమాతవు కానున్న నీ విప్పుడేదేని తెంపునకుఁబూనితివా భ్రూణహత్యకుఁ గూడఁబాల్పడిన దానవగుదువు. దేవీ! కలయూపు నీకు నానోట నేమని విశదీకరింతునమ్మా? నాహృదయము బ్రద్దలగుచున్నది. వక్కాణింపఁ జాలను. ఇదిగో రాజుగారి యాజ్ఞాపత్రము.

సీత—(లోనఁ జదివికొని) అయ్యో! ఈనిందోదంతంబు వినియు నిలువు నీరుగా నాశరీరము రాలిపోకుండెనే. అయ్యో! నేనెంత పాపమునకోర్చితి. హా రామచంద్రానుజా! మందభాగ్యురాలైన యీజానకి సౌఖ్యమున కేదియో యొకయంతరాయము సంభవించుచునేయుండును. సౌమిత్రీ! నాఁడామాయాకురంగంబును, నేఁడీ ప్రజాపవాదమును నీసీత జాతకమునకు దుష్టగ్రహంబులై యామరణాంతము వేధింపఁజొచ్చెనే అయ్యో! అయ్యో! ఎంతమాటపుట్టెను. అన్నా! ప్రాణముకన్న మిన్నగమన్నించు మీయన్నగారు నన్నీలాగున నడవిపాలుచేసెనన, లోకమీప్రవాదముఁగూర్చి నిజమని విశ్వసింపకుండునా? సౌమిత్రీ! నిన్నఁగదా మీయన్నగారు "దేవీ!నీవు నాప్రాణముకన్నను నెక్కుడు ప్రేమాస్పదవు"అని బహూకరించినది.ఇంతలో నింత విపర్యయంబెట్లు సంభవించెనయ్యా? నాయనా! ఇట్టి యపనింద మీరేచందమున విశ్వసించితిరి?

శా॥ ఆనాఁ డంతపరీక్షతోఁ దెలియ లే ♦ దా పాపమో పుణ్యమో
ఆనిర్ణాయకు లిప్పుడేమయిరి ? లేఁ ♦ డా వేల్పుతేఁ డగ్ని లేఁ
డా, నీరేజభవాది దేవతలు లే ♦ రా ? వారువీరేల లే
దా నన్నింతకునేలు నాపతి మన ♦ స్సాక్ష్యంబు సల్లక్ష్యమై?

సౌమిత్రీ! ఆఁడుదాననైన నాకు బుద్ధి యత్యల్పమైనను సకల ధర్మాధర్మ కోవిదుఁడవై సుగుణములయందు మీయన్నగారి కెందును దీసిపోనివాఁడవు నీవైన నిష్పక్షపాత బుద్ధితో నాయవస్థ యించుక విచారింపుము.

సీ॥ నిందించె నేమాడు • నీచాధముఁడెవండొ పతి తాగణించుటే • పాడియయ్యా
పాడియేయనిచూడు • నాఁడగ్నియందునే నుతికిన కథగూడ ♦ మఱతురయ్యా
మఱతురేచూడుమీ • మాటతానేనాఁట ముసుదెల్పనే మొగ ♦ మోటమయ్యా
మొగమోటమేచూడు ♦ తగవెంచి నన్ను నీగాడుదాక భరింపఁ • గూడదయ్యా

తే॥ అకటకట! నిండుచూలాలి • నైననన్ను విడిచి తథ్యాగమైనః యీ • యడవియందు
దిక్కెవరు లక్ష్మణా! మావ • దిగపు నింక నెవరు నీరార్చువారు నా • కేది తీరు॥

మఱంద్రీ! ఎంత వైపరీత్యము సంభవించెను. భగవంతుండగు నగ్ని భట్టారకునిచే నాఖ్యాతంబైన నాచరిత్రమున కిప్పుడు మఱలఁ బ్రత్యాఖ్యానములు బయలుదేఱినవిగా?

లక్ష్మ—దేవీ! దేవయజనసంభవా! మా దురదృష్టవశమున నిట్టియవాచ్యాపవాదములు సంభవించినవిగాని, నీసౌశీల్యమొక్కరు నిర్ణయింపవలసినదా?

మ॥ అనలుండెంతటివాఁడు నీచరితమా • ఖ్యానింప, నీ లోకపావనపాదాబ్జము సర్వభక్షకతచే • ఁబాటిల్లు దుష్పాపమాతనికింబాపె, భవన్మహామహిమయాఁ • తెంగాక, లోకత్రయీజనవిద్రావణరావణాద్యసురహిం • సల్ మాకునూ శక్యమే?॥
తల్లీ! ఇట్టి సుశ్లోకవు నీవు పలుగాకులగు నీలోకులకుఁ గాకపోయితివి.

సీత—నాయనా! ఇది నానోఁచిన నోము ఫలము. ఇందులకు లోకులు దూష్యులుగారు.

లక్ష్మ—తల్లీ! లోకులుగారు మొదటినుండియు నేనే దూష్యుఁడను. నీకింతటి ఘోరపర్యవసానమునకుఁ గారణమైన యారావణాపహరణమునకు నాదికారణమే నేనుగదా,

మ॥ 'దనుజుల్ గ్రుమ్మఱుచుంద్రు, మీవదినెభద్రం' బంచుమాయన్ననాయునికిన్నమ్మి కురంగమేయఁజన, న • య్యో! తాల్మి లేకొంటిగా వనవాటిన్ నినుడించి రావణున కొ • ప్పంజెప్పితిన్ నాఁడు, తప్పునిపాపంబున నేఁడు నీయడవికొ • ప్పంజెప్పితిన్ దల్లిరో॥

సీత—తండ్రీ! ఆవృత్తాంతము తలపెట్టకుము. అప్పటి నాగట్టివాయితనమునకు నాయంతరాత్మయిప్పటికెంత క్షోభించుచుండునో యా

పరమేశ్వరుఁడెఱుంగు. ఒప్పులకుప్పవైన నీయందొకనాఁడైనఁ దప్పు గలుగునయ్యా? కలలోనైన నీవు నాకపకారంబు దలఁతువా నాయనా?

ఉ॥ నీవు మఱందివా తలఁప ♦ నిక్కము బిడ్డవుగాక నాకు, న
త్నా! వనవాసదుఃఖ మిసు ♦ మంతయుఁ గన్పడకుండ నిత్యముఁ
బూవులఁ బండులందనిపి ♦ ప్రోచితి నన్నుపచారభంగి; నీ
పావనశీలమెంచక య ♦ వాచ్యములన్ నినుఁ దిట్టితిన్ గదా॥

బిడ్డా; ఏపాపమెఱుంగని నిన్నుఁ బాపుఁబలుకులాడిన యీపాపాత్మురాలి కప్పటి శిక్షానుభవము చాలదు? మఱల నింతటిదురవస్థ రాఁదగినదే. తండ్రీ! అందునఁగాని యిందునఁగాని నీవు చేసినదేమున్నది? మొదటినుండియు నన్నుఁగట్టఁ ద్రాళ్ళు నేనే తెచ్చికొంటిని చూడు;

సీ॥ మాయదారిమెకంబు♦కై యాసపడి, నాఁడు పతినలయించిన ♦ పాతకంబు
మతిమాలి నీసమీ ♦ హితబోధకైకొనక యనఘాత్మ నిన్నుదూ ♦ రిన యఘంబు
కలుషరక్కసునింటఁ ♦ జెఱఁబడి యున్నినాళ్ళాసఁ గాలముఁబుచ్చి ♦ నట్టిదోసఁ
పతిచేఁబరీక్షింపఁ ♦ బడి చిచ్చునన్ జొచ్చి పెండ్లినై జీవించి ♦ యుండుకలుష

గీ॥ మన్నిఁటికి నెల్లముఖ్యమే ♦ నవనిపైన నాఁడుపుట్టువునై పుట్టి ♦ నట్టిపాప
మిన్నియునుబండి నన్నిట్లు ♦ లేఁచుచుండఁబరులు కారణులనుటకా ♦ స్పదముగలదె

లక్ష్మ—తల్లీ! సతీమతల్లీ! ఎంతమాటాడికొంటివి. ఆ జన్మపరిశుద్ధురాలవగు నీకుఁగూడ నొకపాపమా?

ఉ॥ నీవు పతివ్రతామణివి ♦ నీజననం బిలకున్ విశేష పు
ణ్యావహమయ్యె, నీచరిత ♦ మా మగనాండ్రకునొజ్జబంతి, నీ
పావనమూర్తి నిత్యము ప్ర ♦ భాతమునన్ గనుఁగొన్న జన్మజ
న్మావిలపాపముల్ దొలఁగ ♦ వా ననుఃబోలిన దుర్జనాళికిన్?॥

అమ్మా! ఇట్టిలోకమాతను నిన్నుఁ జేతులార నీక్రూరారణ్యమున నొప్పగించిన నా ఘోరపాప మెన్నిజన్మాంతరములఁ దీఱవలయు? ఇప్పుడు నిన్నూఱడించుటకైన నాకు నోటు లేదు.

సీత—సౌమిత్రీ ! నీవమాయికుఁడవు ! ఈమందభాగ్యురాలి కూఱట గలిగింపఁగలవా రెవ్వరు? దుర్భర దుఃఖానుభవమునకై యేర్పడినదే కదా యీ జన్మము. కాకున్న నీదుర్యోగమేమి? పుట్టినింటఁజూచినను మెట్టినింటఁజూచినను గంపంత బలగమే; జగదేకప్రాజ్యమగు సామ్రాజ్యవైభవమే; లోకేశ్వరేశ్వరుండనం దగినప్రాణేశ్వరుఁడే; వినయ ధురంధరులగు నీయట్టివారు మఱందులే. ఇంతయుండియు,

చ॥ బ్రతికినయంతకాల మప ♦ వాదములన్ భరియించి, భార్యయున్
బతియును ముద్దుముచ్చటల ♦ భాగ్యములేమియులేక, మొండివై
బ్రతుకు మఱంచు నానొసట ♦ వ్రాసెను తీరిచి మూఁడుబంతులన్
మతకర్మిబ్రహ్మ, నీవిపుడు ♦ మాఱ్తువె నాతలవ్రాఁత లక్ష్మణా ! ॥

లక్ష్మ—తల్లీ ! దుఃఖింపకుము. ఎల్లకాలం బీకష్టములే కాఁపురములు చేయునా ? ఎప్పటికేమో ఎవరెఱుంగుదురు. బండ్లోడలగును, ఓడలు బండ్లగును. ఏనాఁటికైన నీకు శుభదినములు రాకపోవు ?

సీత—నాయనా ! ఇప్పటికి నిట్లయినదికదా !

సీ॥ కరకంఠుచాపంబు ♦ విఱిచి నన్నుద్వాహ మాడిననాఁటిగా ♦ ఢానురక్తి
అవినయుఁ గ్రూరుఁ గా ♦ కాసురుఁ నిరసించి నన్నుఁ గాపాడిన ♦ నాఁటిప్రేమ
నగహంత్రియనుఁ జెప్ప ♦ నాతిముక్కుఁ జెవుల్ నఱికి నన్మన్నించు ♦ నాఁటిచెలిమి
వనరాశిఁ గట్టి రా ♦ వణుఁ గొట్టి నాచెఱం గడ తేర్చినట్టి ని ♦ క్కంపు నెనరు

గీ॥ నేఁటితో నొక్కపౌరుని ♦ మాటచేత వ్యర్థమగు చెల్ల నాపాప ♦ వశతఁ గాక
రామచంద్రుని దూఱంగ ♦ నేమిగలదు విధివిధానంబు నెవరు త ♦ ప్పింతురయ్య॥

ఇంతకు సౌమిత్రీ ! సత్యసంధునకు శ్రీరామచంద్రునకు నాపైఁ గల యపూర్వప్రేమానుబంధ మీయపవాదము వలన దొలంగెనని తలంతునా?

లక్ష్మ—తల్లీ ! ఛాయాప్రభాకరుల యనుబంధ మెన్నఁటికైన మాఱునా?

సీత—వత్సా ! మాఱదు నిశ్చయమే కాని, ఒక్క విషయము మాత్రము నాహృదయమును వేధింపక మానదు. చూడు,

చ॥ తనయపనిందఁబాపికొను ♦ దారికి నేనును లోనుగానె ? యి
ట్లని తుదిమాట కేని తగ♦నా ? మొగమోటముఁబెంచి తేని యా
జ్ఞను మఱలింతునయ్యొ? కడ ♦ సారి దనుంబెడబాయుచో మనం
బునఁగలనెయ్యముం దెలుపు ♦ ముచ్చటకేనియు నోఁచనైతినా?

లక్ష్మ—తల్లీ ! అట్లనకు, తనప్రాణముకన్నను ప్రేమాస్పదవగు నిన్ను, పరమపతివ్రతాశిరోమణివగు నిన్ను, నిరపరాధవగు నిన్ను గృహిణివగునిన్నుఁ దనహృదయము విశ్వసింపని కేవల మిథ్యాప్రవాదమునకై మొగమెదుటఁ గఠోరముగ "నన్నువిడిచి యెందేని యరణ్యభూములకుం బొమ్ము" అని యాజ్ఞాపించుటకుఁ గరుణాస్వభావుండగు శ్రీరామచంద్రునకు నోరాడునమ్మా? చూడు,

చ॥ ఒకయెడ స్వప్రజానికృతి, ♦ యొక్కెడ నాత్మసతీవియోగ మా
త్మకువిషమంబులై, బలువి ♦ ధంబుల యోజనఁజేసి, భూమినే
తకు జనరంజనంబె విహి ♦ తంబగుటన్, మొగమోటమెంచి యిం
తకు ననుఁ బంపె నీపతి మ ♦ నంబెటువంటిదొ నీవెఱుంగవే ? ॥

క॥ శరణంబిఁక నీచరిత
స్మరణంబే నీదుపతికి ♦ జానకి! జీవ
న్మరణంబనఁ దగు తన సం
సరణంబుఁ దరింప విరహ ♦ సంతాపమునన్॥

సీత—వత్సా? దుఃఖపరవశత్వమున నేమో యాడితిఁగాక, సరళహృదయుండగు నాపతికి నాపైఁగల ప్రేమానుబంధ మెఱుంగనిదాననుగాను. నేను మున్ను రావణక్రూరనిర్బంధమునను న్నసమయమునఁ గరుణాసముద్రుం డాతండు నాకై యనుభవించిన పరితాప మాంజనేయునిచే విన్నదాననుగానా? అక్కటా !

రాజధర్మ మెంతదారుణము. చేపట్టిన యిల్లాలియెడనైన జాలిదలంచుటకు స్వాతంత్ర్యము లేకపోయెను. నన్నుఁగూర్చి ప్రజాసముదాయమున వ్యాపించినది మిథ్యాప్రవాదమని తెలిసి యుండియు, నింతటి సాహసమునకుం దెగి, జగదారాధనదీక్షా ధురంధరుం డగుట, కాకుత్స్థాన్వయప్రదీపకుండగు శ్రీరామభూపాలున కొక్కనికిం జెల్లెఁగాక, యొరులిట్టి వీరవ్రతంబొనరింపఁ గల్గుదురా? ఇంతకునాయనా,

సీ॥ ఈకనుంగవ యెన్నఁ ♦ డేనిఁ గన్గొనునో కో కామితన్మూర్తి శ్రీ ♦ రామమూర్తి
ఈకర్ణయుగ మెన్నఁ ♦ డేవినం గలుగునో కపురంపుఁ బలుకు రా ♦ ఘవుని పలుకు
ఈకరద్వయ మెన్నఁ ♦ డేని సేవించునో మోక్షప్రదంబు రా ♦ ముని పదంబు
ఈజీవితం బెన్నఁ ♦ డేని పావనమౌనో ప్రాణేశు చెలిమిఁద ♦ పంబు కలిమి
గీ॥ ఎన్నఁటికినైన నే వేల్పు ♦ లేని, నేను నీకు లేని దయాళుశై ♦ యీదురంత
విరహవారాశిలోనుండి ♦ వెలికిఁదెచ్చి జీవితేశ్వరుపజ్జ నన్ ♦ జేర్తురయ్య!॥

లక్ష్మ—తల్లీ! నీవంటి పతివ్రతామతల్లుల సంకల్పంబు లేనాఁటికైన సఫలములుగాకపోవు. దేవీ! నీకింక విన్నవింపవలసిన దేమి?

ఉ॥ దాయలకైన రాఁదగని ♦ దారుణ మిట్టి యవస్థ నీకు నె
ట్లోయనుభావ్యమయ్యె, నిఁక ♦ నుమ్మలికం దిగద్రిమ్మింగి నీమనో
నాయకు రామచంద్రుని మ ♦ నంబున నిల్పి దినంబు లెట్టులో
త్రోయఁగదమ్మ, తాపస వ ♦ ధూటులతోడఁ దదాశ్రమంబులన్॥

సీత—వత్సా! నీకు నాపైఁగల భక్తివాత్సల్యముచే నిట్లాడితివిగాని నాయనా! నేనిప్పుడున్న తెఱంగునకుఁ దో డొక్కరిపంచం జేర వలసిన దినములా యివి?

మ॥ కలకాలంబిటు చేసికొన్నపతికిం ♦ గాకుండ నేకాకినై
యిల జీవించుట యెంతహైన్యమగు? న ♦ న్నేరైన " నేలా మగం
డిలు వెళ్ళించె వచింపు " మన్నపుడె ♦ యీప్రాణముల్ పోవె? కాం
తలలోనం దలయెత్తి నేఁబ్రతుకఁజ ♦ న్నా యింతకుం బాత్రినై ॥

మఱియు వత్సా! నాయీ వియోగదుఃఖమున కిన్నాళ్ళని పరిమితలేదుగదా. హా తాళశరాలనై యొరుల పంచలంబడు నీచత్వమునకోర్చి యెవ్వరికొఱకై శరీరయాత్ర సాగింతును?

లక్ష్మ—తల్లీ! సకలధర్మ రహస్యంబుల నూలమట్టముగ నెఱింగిన నీకెద్దియేని బోధించుట కేనెంతవాఁడను కాని,

సీ|| తనువుపైఁ బోసి కూ ♦ డని సాహసముచేసి పతినిరాముని నిందఁ ♦ బఱుపకమ్మ
తాల్మిమై నెచటనో ♦ తలదాఁచికొని యుండి కష్టకాలంబెల్లొ ♦ గడుపుమమ్మ
ఏనాఁటికైన మా ♦ కింక యాధారమౌ నీగర్భమేని ర ♦ క్షింపవమ్మ
పతియాజ్ఞ మున్నె చె ♦ ప్పక నిన్ను వనికిఁదెచ్చి తెంపఱి నన్ను క్ష ♦ మింపుమమ్మ
గీ|| ఒదిగి భవితవ్యమునె నమ్మి ♦ యుండవమ్మ వేల్పులేనిన్ను విభుని క ♦ ర్పింతురమ్మ
సెలవొసఁగుమమ్మ నన్నుగక్షింపవమ్మ కడపు సీతమ్మ! యిదెనమ ♦ స్కారమమ్మ||

తల్లీ! నేనగ్రజుని పాదోపజీవినని యెఱుఁగుదువు. ప్రాణాంతమగు సమయమునైన నేనుమాయన్నగారి యాజ్ఞనుల్లంఘించి యెఱుంగను. కావుననే యింతటి ఘోరకార్యనిర్వహణమునకై యార్యపుత్రుఁడు నన్నేనియమించె. తదాజ్ఞానువర్తినైనెమీ నెడ మహాపరాధముగావించితి! మర్భరగర్భాలసవగు నిన్నేకాకినిఁగా నీకీకారణ్యమున డించి నేనొంటిగ నింటికిఁబో సెలవడుగుచున్నాను. తల్లీ!

(పాదములపైఁబడి దుఃఖించును)

సీత—(చేతులంటి) నాయనా! దుఃఖింపకుము. మనోవాక్కాయకర్మంబుల నీయందు నాకెంతమాత్రము కోపములేదు. అట్టి జీవితేశ్వరుఁడే కాదు. పుత్రసమానుండగు నీయట్టి మఱందియు లభించుట చేతనే నిజముగా నాజన్మము పవిత్రమైనది. జన్మజన్మంబులకు శ్రీ రామచంద్రుఁడే ప్రాణేశ్వరుండై లక్ష్మణుఁడేమఱందియగుటకు నిత్యము వేయిదేవతలకు మ్రొక్కుచుండెద. నాయనా! నీ విఁక మఱలిపొమ్ము.

సీ|| కన్నీరుమున్నీరు ♦ గానేడ్చి నీవు నా విధివిధానంబు త ♦ ప్పింతువయ్య
తడవైనచో మాట ♦ వడుదు వింటికినేగి మఱఁది లక్ష్మణ! నన్ను ♦ మఱవకయ్య

ముగురత్తలనుఁగేలు ♦ మోడ్చితినని సీతనోఁచిననోము ♦ లిట్లేఁచె ననుము
విభునకునామాట ♦ నభివాదన మొనర్చి ప్రాణానందనచింత ♦ బాయననుము

గీ॥ నడికినోడి తెగించిన ♦ విడిచెఁగాని ♦ యింతకోర్చునె నాజీవి ♦ తేకుమనసు
తండ్రి! మీయన్న నెట్టులో ♦ దార్చుకొనెదొ జగము బ్రతుకెల్లనిఁక నీవ ♦ శంబసుమ్ము

నాయనా। నేనదృష్టహీనురాలను ఆటువంటి జీవితేశ్వరునితో భోగభాగ్యము లనుభవించునంతటి యదృష్టము విధి నానొసటలిఖింప లేదు. నాకై నీవుగూడ నేలపరితాపమొందెదవు? మహదైశ్వర్యములఁ దులతూఁగుచున్నను నార్యపుత్రుని జీవయాత్ర నామూలమున దుఃఖ భాజనమైపోయెఁగదా. కరుణాస్వభావుండగు నార్యపుత్రుం డీవియోగ దుఃఖమున నేమైపోవునో యని కాని వత్సా, నాయవస్థకై యంతగాఁ జింతింపను. నేనెక్కడనుండినను, నార్యపుత్రుని కుశలవార్తమాత్రము నాకుఁదెలియుచుండినంజాలు. ప్రాణేశ్వరు క్షేమమే నాక్షేమము. నాయనా। సౌమిత్రీ! భరత శత్రుఘ్నులు గూడ ఆర్యపుత్రసేవా విధియం దేమఱకుండునట్లునామాటలుగావచింపుము. నాచెలియండ్రు నాకొఱకై బెంగపెట్టుకొందురు. వారినెట్లోయూఱార్పుఁడు. వత్సా మఱచితి, నన్నీవిధికిం బాల్పఱచినందులకు నేను తనపైఁ గినుక వహించితినని యార్యపుత్రుఁడు తలంచునేమో, వారితో నిట్లనుము,

సీ॥ తనకు లోకాపవా ♦ దము మాసిన జాలు జీవమేనొసఁగసం ♦ సిద్ధ ననుము
తనకంటెనా జన్మ-తారకంబేమినాతనువునాత్మయు నెల్లఁ దానె యనుము
తనయాజ్ఞఁ దలమోసి ♦ కొని తపోవనభూమి శీలమేనమ్మి వ ♦ సింతుననుము
తనువులే దూరమ ♦ య్యెనుగాని యాత్మలందైక్యమిద్దానఁ బెం ♦ పయ్యె ననుము

గీ॥ విరహపరితప్తమయ్యు నా ♦ ప్రేమలతిక యశ్రుజలసేకమున వృద్ధి ♦ నందు ననుము
నిజమెఱిఁగి లోక మెప్పుడు మ ♦ న్నించు నపుడె! మఱల నన్నేలుకొనుట ధ ♦ ర్మంబయనుము

లక్ష్మణా! నాకు సంభవించిన యీదుర్భరవియోగమున నేను దుఃఖించుచునే యున్నచో నాకిక్కడ నొక్కక్షణమైన సాగునా? నేను

దుఃఖము పూర్ణముగా విడిచిపెట్టినాను. నాజీవితవిషయమై యార్యపు
తునితో నావచనములుగా నిట్లనుము.

మ॥ లలితస్మేరకలావిలాసము, వినీ ♦ లభ్రూలతావిభ్రమం,
బలఘు ప్రేమరసప్రసన్ననయనా ♦ న్జాలోకనప్రౌఢ, ము
జ్జ్వలతేజస్స్ఫురణంబు, శాంతరసభా ♦ వస్ఫూర్తి మీమూర్తిని
స్తులితానందమునన్ భజించుచుఁ దరిం ♦ తున్ జన్మమాత్మేశ్వరా !॥

మ॥ కమనీయంబులు తావకీనగుణము ♦ క్తారత్నముల్ ప్రేమ సూ
త్రముననన్ గ్రుచ్చి, జపక్రమాకలనఁ జే ♦ తఃపీఠి మీదివ్యరూ
పముసంధించి, నిరంతరానుభవ సే ♦ వా భావనా పారవ
శ్యమునన్ బుచ్చెద జీవయాత్ర, రఘురా ♦ మా! దీనచింతామణీ!॥

లక్ష్మ—మేలు, వీరపతివ్రతాశిరోమణీ! మేలు నీవు ధీరమానసవు,
నాకుఁజిత్తస్థైర్యములెట్లుకుదురును, కుదురక చేయునదేమి? ఎట్లు
బోకతప్పదు. అయ్యో! మిట్టాడ నరుండులేని యీనట్టడవిలో నిన్ను రక్షింపుమని యెవ్వరికొప్పజెప్పి పోవుదును ? నారాయణా! దీనత్రాణ పరాయణులైన కరుణామయులలో నొక్కరును దిక్కుమాలిన యీ రామకుటుంబినిం గాపాడువారులేరా! నావలెనే లోకమంతయు నిష్కరుణమై పోవునా? కానీ, పరమేశ్వరుని పరమాద్భుతసృష్టివిలాసమంతయు లోకమున వెల్లడించుచు, ననేకజంతుసంతానములకుఁ గన్నతల్లి వలెనున్న యీవనదేవతామతల్లికే యీనాతల్లి నొప్పజెప్పిపోయెదను. అమ్మా! వనదేవతా! నీవు సుగుణవల్లివి. ఆర్ద్రమానసమున నామనవి యాలింపుము. దైవోపహతయై, నీకడుపు నందాగవచ్చిన యీయిల్లాలెవరనుకొంటివో,

సీ॥ జనకరాజర్షి పా ♦ వనయజ్ఞవేదియం దవతారమందిన ♦ యాదిలక్ష్మి
శివధనుర్భంగ ముం ♦ కువగాఁగ శ్రీరాము కేలుపైకొన్న వ ♦ ధూలలామ
కసిఁడికోఁతలకోర్చి ♦ యనురాధమునివీటఁ గులసతీత్వమునిల్పి ♦ కొన్నసాధ్వి
తనవినిర్మలచరి ♦ త్రము నగ్నికీలలన్ బ్రకటీకరించిన ♦ భవ్యశీల

గీ॥ భగవతి యరుంధతీదేవి • పరిస్తుతించు పాలఁతులవలంతి, నిందుపాఱ • ద్దులపడంతి
పతివియోగార్త, సీతఁగా • పాడుమమ్మ ధన్యగుణవల్లి! వనదేవ • తామతల్లి

తల్లివై దేహి! పాపభూయిష్ఠమగు నాజన్మమున కెయ్యది ఫలమో యయ్యది నెఱవేర్చితిని. నేనింకఁబోయెదను. పరమపావనములైన నీచరణారవిందములఁకు నమస్కారము (నమస్కరించును)

సీత—నాయనా! పోయెదవా! నిన్నుఁజూచుచున్నఁనఱకు నాకుదుఃఖము కుదుటఁబడదు నీవు శీఘ్రముగఁ బొమ్ము.

లక్ష్మ—తల్లీ! పోవుచున్నాను. (కొంతదూరముపోయి మఱలవచ్చి సీత పాదములపైఁబడి) అయ్యో! ఎంతయని తెంపుపహించెదను. ఇంతలో నెవ్వరేని నీరక్షణకు నేతెంతురేని కొంతసంతసముతో నింటికిఁజేరుదునే. ప్రొద్దుబొత్తుగాఁ గ్రుంకిపోవుచున్నది. నిబిడ తరుచ్ఛాయాసముదాయముచే నీయరణ్యము మఱింతకాఱు చీఁకటులకాకరమై భయజనకముగ నుండునే ఎట్లుపోవుదును.

సీత—లక్ష్మణా! నీవు మఱల నాకు దుఃఖమునుగలిగించుచున్నావు. నీవు పొమ్ము. నాకెవ్వరివలన నేభయములేదు. వత్సా! నీకు నెట్టిగాని నాయట్టిమందభాగ్యురాలికి సులభముగ మృత్యువు సంభవింపఁగలదఁటోయి?

లక్ష్మ—తల్లీ! అట్లుగాదు. పీరపతివ్రతాత్వతేజోవిభ్రాజవగు నిన్నుఁ దేరి చూడ నెవ్వరికి సాధ్యము! ఈయరణ్యమునందైన నేమి నీకు సాయపడని వారెవ్వరు?

సీ॥ నాగాంగనలు మణీ • భోగాతపత్రంబు లెండ వేళలనుద్వ • హింత్రుగాక
లీలామృగాంగనా • లికలపోలికఁ గ్రోలుపులులు వాలిమితోడ • మెలఁగుఁగాక
తటిగొమిఁజిఁగి తమంతఁ • దరులు వాచవులూఱు వివిధఫలంబుల • ర్పించుఁగాక
విపినదేవత లూడి • గపు సానులై శయి జోకొట్టి నిదురబు • చ్చుదురుగాక

గీ॥ ఎచటనుండినఁగానివా • రెవరు నీకు, కాలములు పంచభూతముల్ •గ్రహచయంబు
వేనములు నిన్నిఁయేల • నీవిమలమైన యాత్మశుద్ధిగొ నీ కవచ•జాగ్రింగిజోడు॥

కావున నిర్భయముగా నింకఁ బురికేగెదను. (నిష్క్రమించును.)

సీత—అక్కటా! పుణ్యమూర్తి మాలక్ష్మణుఁ డేగుచున్నాఁడు? నాయవస్థయటుండ నాతని దైన్యస్థితిఁ బరికించిన నాకు దుఃఖ మినుమడించుచున్నది. అయ్యో! ఎంతటి కరుణాసముద్రుఁడు, ఎంతటి భ్రాతృసేవాతత్పరుఁ డీ లక్ష్మణుఁడు.

సీ|| కనుఁగవ నిండ నా ♦ ఱునితాంత బాష్పముల్వ్రేలికి జిప్పలనప్ప ♦ ళించుకొనుచు
నాదెసఁ భయము, దై♦న్యము, విస్మయము, జాలి దేలుచూపుల వెన్కఁ ♦ దిరిగికనుచు
ననుఁబ్రోచు కీనబాం♦ధవులకైయాసతోఁ బలుమాఱు దెసలవి ♦ భ్రాంతిఁగనుచు
కనుజూపుమేర ద ♦ ప్పిన వెన్కకే తెంచి మఱలుచు వచ్చుచు ♦ మఱలఁజనుచు
గీ|| చిత్తమేలాగొ రాయిచే ♦ సికొని తనదు ప్రాణముల నాపదంబుల ♦ రక్షగట్టి
పురికిఁ బోలేక పోలేక ♦ బొందితోడఁ బోవుచున్నాఁడు సౌమిత్రి ♦ పుణ్యమూర్తి

ఇప్పటికాతని దివ్యమూర్తి నాకన్నులకుఁ జాటైపోయినది. ఈపాటికి గంగ కవ్వలదరికిఁ జేరియుండును. అతనితో నేమేమో ధైర్యవచనములాడితిఁగాని యొంటినై యెక్కడికేగుటకు నాకిపుడు ధైర్య మాగుటలేదు. (సంభ్రమమున దిక్కులంబరికించి) వీరెవరో

(వాల్మీకిప్రవేశించి) వత్సా! జానకీ! నీకుస్వాగతము.

సీత— తాపసోత్తమా! అభివాదనము. (నమస్కరించి) విపన్నను నన్నురక్షింప వచ్చిన దివ్యర్షులు తామెవ్వరో?

వాల్మీ—తల్లీ! నీవు నన్నెఱుంగవుకాని నేను నిన్నెఱుంగుదును.

మ|| విను వాల్మీకియఁటందురమ్మ నను; నీ ♦ వృత్తాంతముల్ యోగదృ
ష్టినెఱుంగంబడె, మాకు నీవిభునకున్ ♦ స్నేహంబనల్పంబు, నీ
జనకుండున్ బరమాప్తుఁ, డాదశరథ ♦ క్ష్మాభర్తయున్ మేమెఱిం
గినవాఁడే, దిగులొందకమ్మ యనుర ♦ క్తిన్ నిన్నురక్షించితిన్||

సీత—తండ్రీ! పొరపడితిని. పురాణబ్రహ్మవాదులగు ప్రాచేతసుల మిమ్ము నేనుమాత్ర మెఱుంగ కేమి? శోకమూర్ఛావివశత్వమున మతిమాలి మీయెడ నపచారమొనరించితి, క్షమింపుఁడు

వాల్మీ—కుమారీ! యపచారమేమి నాబిడ్డవేకదా నీవు?

చ॥ మన మునిపల్లె యాతరుల ♦ మాటునసే యొకకూతవేటుదాఁ
పునఁగల, దర్ఘ్యముల్ గొనుము ♦ పోవుద, మచ్చట మాతపస్విసీ
జన మరచేతఁ గన్నులిడి ♦ సాకుదు, రయ్యది నీ గృహంబె, నీ
యనుచరదాసికాసముద ♦ యంబులు సంయమిబాలికామణుల్॥

సీత—తండ్రీ! ఇట్టి కష్టకాలమున మాపంచకు రమ్మని నన్నాదరించు
నాప్తబంధువులు మీకంటె నాకెవ్వరులేరు? కాని

చ॥ ననుభరియింపఁ గష్ట, మొక ♦ నాఁటిదిగాదిదినాకు; నెన్ని నా
ళ్ళని మిమువంటి బంధుల గృ ♦హంబులలోఁ దలదాఁచికొందుఁగా
దనివచియింపఁ గాని జన ♦ కా! కలకాలము మీకుభారమై
దినములుద్రోయనే ననుమ ♦ తింతునె యీకొఱగానిమేనికై ?॥

వాల్మీ—బిడ్డా! యెంతమాటాడితివి? నీవంటి పతివ్రతామతల్లులసత్క
రించుటే మాతపస్సాఫల్యము.ఇందులకు మేము నిమిత్తమా
త్రులమే కానిమాయాశ్రమవనీతలంబేసీయట్టివారి నెందఱనో
భరింపఁగలదు. చూడు,

చ॥ తడవులనుండి శిష్యసము ♦ దాయముతో నివసింతుమిందు, నె
న్నఁడు తనుయాత్రకై కఱవు ♦ నంబడ, మీవనివేల్పుటావుకై
వడిగను పమ్ము మాయతిఘ ♦ వర్గము, నెందఱికైన లేదనక్
గడ కిట మాకుటీరహరి ♦ ణంబులకై నను లేదు మానినీ ! ॥

జానకీ! వేయేల? యీపరిసరవనీతలంబంతయుఁ జిరకాలమునుండి
యథేచ్ఛముగామేము పరిపాలించుచున్నారము. మీరాజులకున్న పరి
ఢవమంతయు మాకును లేకపోలేదు చూడు;

సీ॥ గంగాపగాతరం ♦ గములఁదోఁగిన శీతవాతాంకురములు సే ♦ వకులు మాకు
సవనధూమపయోద ♦ సమితిఁగాంచినటించు నలమయూరములు గా ♦ యకులు మాకు

అరివర్గమున కసా ♦ ధ్యములైన పావనాశ్రమములు కొల్వుకూ ♦ టములు మాకు
ఫలసమిద్వల్కలా ♦ దులఁగానుకలొసంగు తరులు సామంత సం ♦ తతులు మాకు
గీ॥ నాటకయె పండు నివరిధా ♦ న్యములపంట, ఆలమందలపాడి భో ♦ గ్యంబు మాకు
పావనంబిందు స్వచ్ఛంద ♦ జీవనంబు అవనిపుల కింతకంటె సౌ ♦ ఖ్యంబు గలదె?॥

సీత—జనకా, ఇచ్చటనాకు సౌఖ్యలోపముజరుగునని కాదు.

చ॥ అంతటికాపురంబునకు ♦ నాఁడిదియై, నడివోసి, మానిను
ద్ధాంతముపొంత కేఁ దగుదు ♦ నంచెటుపోవుదు; నీవనాంతమం
దంతటిదాననై గఘుకు ♦ లాంకుర మేర్పడు నంతదాక నీ
వంతభరించి, యంత బల ♦ వంతముమై తరియింతు జన్మమున్.

వాల్మీ—బిడ్డా దుఃఖింపకు. ఈ నిందకుఁగల కారణార్థము వేఱు,

ఉ॥ పుట్టువుతోడనే పరమ ♦ పుణ్యవు నీవయి నేటికెట్లొ యీ
పుట్టిననింద యేదురిన ♦ మ్ముఁ బొనరింపఁగ లేదుగాని నా
పుట్టువుమంచిదై, జనక ♦ భూపతిపోలిక, నిన్ను నేను నా
పట్టిగనెంచి పెంచికొను ♦ భాగ్యము నాకు ఘటించె జానకీ!

తల్లీ! నీపాతివ్రత్య మెఱుంగనివారు లేరు. నిన్నెవ్వరో శంకింతురను భయ మక్కఱలేదు. నీయుపచారమునకై నేను నియమించు నొకరిరువురు దివ్యపురంధ్రులకుఁ దక్క నన్యులకు నీ వదృశ్యవై యుండునట్లు నీకు వరమిచ్చితిని రమ్మ.

సీత—తండ్రీ! ఇంక నిర్భయముగ నీకడువున దాఁగియుండెదను.

వాల్మీ—బిడ్డా! నీవు వెఱచోట కెక్కడికో రాలేదు,

ఉ॥ ఈ మునిపల్లెయే మిథిల, ♦ యే జనకుండఁ, దపస్విసీజనం
బే మదినమ్ము బాంధవ, మిఁ ♦ కేటికొఱంత, పడంతులెందు రా
రా మునుగానుపుంబురిటి ♦ కై తమ పుట్టినయిండ్లకున్? కుమా
రీ! మిథిలేశ్వరుండొకఁడు ♦ నేనొకఁడా? నినుఁగూర్మిఁ బెంపగన్॥

సీత—నాయనా! అట్లెన్నఁడుఁ దలంపను. ఆ జనకుఁడు నన్ను నానంతోషకాలమునఁ బెంచెను. నీవో నాయాపత్కాలమునఁ గడు

పున నిడికొని పెంచుకొననున్నావు. ఆజనకునికన్న నీజనకుఁడే నాకు మిన్నయనుకొన్నను దోషముగాదు.

వాల్మీ—బిడ్డా! అతఁడు జగదేకపూజ్యుఁడు కడుపునఁ గనకున్నను జగదీశ్వరి యగు నీయట్టికూఁతునకుఁదండ్రియై సార్థకనామధేయుఁడయ్యె! నేఁటికి నాతపము సఫలమై నాకు లభించితివి. కాని, అతఁడు రాజాధిరాజు. నేనో యడవికాఁపరినగు తాపసుఁడను,

సీ|| కలమాన్నముం బెట్టఁ ♦ గలనో లేనో కాని వెదురుబియ్యమున కే ♦ కొదవలేదు
మేటిపణ్యారంపు ♦ మాట యేమో కాని కందమూలముల కే ♦ కఱవు లేదు
కలధౌతమణి సౌధ ♦ ములు లభింపవు గాని పర్ణశాలల కో ♦ పంబు లేదు
జిలుఁగు మేలిమి పట్టు ♦ చీర లేమో కాని వల్కలంబుల కేమి ♦ బ్రాఁతి లేదు
గీ|| పడకకై దూదిపాన్పులె ♦ క్కడివి గాని పూరిసెజ్జలు వెండి బం ♦ గారుగావు
పెట్టిపోఁతల కొక వేళఁ ♦ బేదనైనఁ గరుణ సనునాకుఁ బేదఱి ♦ కంబు లేదు||

తల్లీ! రమ్ము. ఇప్పటి నీయవస్థకు నాపెంపుతగియే యున్నది.

సీత—నాయనా, నీయాదరము నన్ను దుఃఖము మఱపించినది.

వాల్మీ—బిడ్డా! కన్నులు తుడిచికొని, దారిచూచి నడువుము. సందె చీఁకటిగూడను (నడుచుచు) అమ్మా! ఇక్కడ హెచ్చరిక.

సీ|| కుశసూచి కంటకాం ♦ కుర పఙ్క్తిం బిడి కాలిసడజాడలనె మెల్ల ♦ నడువుమమ్మ
నేలమీదికిఁ జాల ♦ వ్రాలె నీతరుశాఖ తలవాంచి, మెలపునఁ ♦ దొలఁగవమ్మ
పునుఁగు దట్టముగఁ బే ♦ రిన ఱాలు కాల్జారు; పూనికమై తీవ ♦ లానవమ్మ
సెలయేటిజాలు నిం ♦ చిన యీఁబు లిచ్చోట నవురుదుబ్బుల నడ ♦ యాడవమ్మ
గీ|| అల్లదే మహర్ష్యాశ్రమం, ♦ బాలమంద రొప్పికొని వచ్చు బ్రహ్మచా ♦ రులును వారె,
అలరి నారాకఁ బోనికిం ♦ దెలుపనేమొ హరిణకం బిదె చివ్వునఁ ♦ బరుగువారె||

(అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము

సంపూర్ణము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము.

## తృతీయాంకము.

(నేపథ్యమున) స్వాగతము తపస్వినికి.

(తరువాత బాటసారి వేసమునఁదాపసి ప్రవేసించును)

ఇదిగో, వనదేవత ఫల కుసుమ పల్లవార్ఘ్యమున నన్ను బూజింప వచ్చుచున్నది.

వనదేవత—(ప్రవేశించి) అర్ఘ్యము చల్లి తపస్వినీ! స్వాగతము.

మ॥ ఘనపుణ్యంబునఁగాక సాధుజనసాం ♦ గత్యంబుచేకూర దీ
దినమేపండువునాకు, మీకుఁబరితృ ♦ ప్తిక్రభోగ్యమేతద్వనం
బు; నిషేవింపుము, నీవశంబిటద్రుమం ♦ పుష్పిడలో, నీరమో
మునిదీక్షాశనయోగ్యమైతగుఫలం ♦ బో, కందమూలంబులో.

తాప—నిసర్గపవిత్రమగు నిట్టిసాధుసౌశీల్యము సర్వథా వర్ధిల్లుఁగాక.

వన—పూజ్యురాలా! (అర్థోక్తిలో) తామెవరో.........?

తాప—నేను ఆత్రేయిని.

వన—ఆత్రేయీ! ఎక్కడనుండి యీరాక ?

ఆత్రే—వాల్మీకుల ఆశ్రమమునుండి

వన—మఱి ఈదండకారణ్యప్రచార మెందులకు ?

ఆత్రే—ఈప్రదేశమున అగస్త్యప్రముఖులు ఉద్గీథవేత్తలు పలువురున్నారుఁ వారిసన్నిధానమున వేదాంతవిద్య నభ్యసింతమని.

వన—వేదాంతవిద్యకై యితరమును లెందఱో, పురాణబ్రహ్మవాదిని ఆ ప్రాచేతస మహర్షినే ఉపాసించుచుండఁగా, మీకీదీర్ఘ ప్రవాసాయాస మెందులకు ?

ఆత్రే—అచ్చట నాకు వల్లమాలిన మహాంతరాయము తటస్థించినదిలే.

వన—ఎట్టిదది ?

ఆత్రే—ఆమహానుభావున కేదేవతయోకాని, పాలువిడుపువయస్సునం దున్న యిరువుర బాలకులఁ దెచ్చి యప్పగించినది. ఎల్లవిధముల నద్భుతములగువారిచర్యలకు, ఋషులచిత్తములేకాదు, సమస్త చరాచర భూతాంతరంగములును ద్రవీభూతములగుచున్నవి.

వన—వారి నామధేయములు తెలియునా ?

ఆత్రే—ఆదేవతయే చెప్పినది "కుశలవులు" అని. వారిప్రభావము గూడ నెఱుకపఱచినది.

వన—ఎట్టిదా ప్రభావము ?

ఆత్రే—సరహస్యములు జృంభకాస్త్రములు వారికి జన్మసిద్ధములఁట.

వన—ఆహాహా; ఎంతవిచిత్రమిది !

ఆత్రే—వాల్మీకి భగవానుఁడు దాదిపనులు మొదలుకొని తానే నిర్వర్తించుచు, వారింబెంచి పెద్దవారిఁ జేసినాఁడు, చూడాకర్మమాచరించినాఁడు. వేదములుదక్కఁ దక్కినవిద్యలెల్ల సావధానముగ నేర్పినాఁడు. గర్భైకాదశ వర్షంబున, క్షాత్రకల్పముతో నుపనీతులఁగావించి, త్రయీవిద్యసైతము గఱపినాఁడు. అతిప్రదీప్త ప్రతిభాశాలురగు అట్టివారితో మాబోంట్లకు సహాధ్యయన యోగ్యత పొసంగునా ?- చూడు; ప్రాజ్ఞునకునెట్లో జడునకుఁ గూడనట్లేగురుఁడు విద్యనేర్పును. ఒక్కరికి గ్రహణశక్తి హెచ్చించి, వేఱొకనికిఁదగ్గింపఁడు, కాని ఆయిరువురకుఁ దెలివి తేఁట

లలోఁజాల వ్యత్యాస మగుచుండును. ఇందాశ్చర్య మేమున్నది?
ప్రతిబింబమునుజాతిరత్నమువలె,గ్రహింపఁగలుగునా?మట్టిముద్ద

వన—ఇదా యధ్యయన విఘ్నము?

ఆత్రే—ఇదేకాదు, ఇంకొకటియు

వన—అది యెట్టిది ?

ఆత్రే—ఒకనాఁడాబ్రహ్మర్షి, మాధ్యందినసమయమునఁ దమసానది కేగినవాఁడు, అచ్చటఁగవగూడిక్రీడించుచుండిన క్రౌంచదంపతులలోనొకదానిని వేఁటగాఁడుచంపుచుండఁగాఁజూచినాఁడు. అంతనాకస్మికముగా నావిర్భవించిన అసంకీర్ణయు అనుష్టుప్ఛందో, బద్ధయు నగు వాగ్దేవి నీవిధముగ నుచ్చరించి నాఁడు.

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామ మోహితమ్॥

వన—చిత్రము ! ఆమ్నాయములకంటె వేఱైన కొత్త ఛందస్సులవతరించినవే !

ఆత్రే—ఆవిధముగా శబ్దబ్రహ్మవిర్భావమును బొందిన యమ్మహర్షికిఁ, దక్షణమే భూతభావనుండగు బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై, "మహర్షీ!నీవు వాగ్బ్రహ్మమునఁ బ్రబుద్ధుండవైతివి. ఇంకరామ చరిత్రమును వర్ణింపుము. జ్యోతిర్మయంబు నార్షంబునగు నీ ప్రతిభాచక్షువున కడ్డులేదు. ఆది కవివైతివి" అని హెచ్చరించి యంతర్హితుండయ్యెను- అంతనమ్మహర్షి వాల్మీకి శబ్దబ్రహ్మమున కాదిపరిణామంబగు రామాయణేతిహాసమును రచించెను.

వన—ఆహా! అలంకృతమైనది ప్రపంచము.

ఆత్రే—ఆయీకారణముల చేతనే అక్కడనాకధ్యయనము సాగలేదని చెప్పితిని.

వన—బాగున్నది.

ఆత్రే—కల్యాణీ! ఆలసట తీఱినది. అగస్త్యాశ్రమమున కేగెదను. దాని చూపుము.

వన—ఇదిగో ఇక్కడనుండి పంచవటి మీఁదుగా గోదావరీ తీరముం బట్టిపొమ్ము.

ఆత్రే—(కన్నీటితో) ఆతపోవనమా యిది? ఇదిపంచవటియా? ఇదిప్ర స్రవణ పర్వతమా? జనస్థాన దేవతవగు వాసంతివా నీవు?

వాసం—అవును సర్వమునట్లె-

ఆత్రే—హా! వత్సాజానకీ! ఇచ్చట నీయాప్తబంధువర్గమును జూడఁగనే నాపట్టీ నీవు నామశేషవై పోయినను గన్నులం గట్టి ట్లున్నావు గదే.

వాసం—(భయముతో తనలో) ఏమిది! నామశేషయనుచున్నది!(ప్రకా శముగా) పూజ్యురాలా! సీతాదేవి కేమియత్యాహితము?

ఆత్రే—అత్యాహితమే కాదమ్మా అపవాదమునూ (చెవిలో) ఇదికథ

వాసం-హా హా! దారుణము దైవనిర్ఘాతము.(మూర్ఛిల్లును)

ఆత్రే—కల్యాణి! ఊఱడుము

వాసం—హా ప్రియసఖీ! జానకీ! నీవుపుట్టినపుట్టుకయేమి? ఈ యవస్థా పరిణామమేమి? హా రామభద్రా! రామభద్రా! ఎంతపని చేసితి వయ్యా? చాలు నీతోనేమి? అమ్మా ఆత్రేయీ! ఇంతకునిప్పుడు సీతగతి యేమయ్యెనో తెలియునా ?

ఆత్రె—లేదు తెలియదు.

వాసం_ఔరా?ఎంతమాట. పైనఅరుంధతీ వసిష్ఠులు కనిపెట్టియుండఁగా పెద్దలురాణులుముగ్గురును బ్రతికియుండఁగనే రఘుకుటుంబ ములో నింత పనిజరిగినదా? హా! హా!

ఆత్రె—అప్పట్టునవారెవ్వరు అయోధ్యలోలేరు. ఋష్యశృంగునియాగ మునకేగియుండిరి. అది పండ్రెండేండ్లయాగము, మొన్న మొన్న

నే ముగిసినది. ఋష్యశృంగుఁడందఱికి సంపకములు చేసినాఁడు కాని కోడలు లేక పాడువడిన అయోధ్యలోఁ గాలుబెట్టుటకు వారి కెవ్వరికి నిష్టము లేక వాల్మీకి తపోవనమునఁ గాలక్షేపము చేయ నెంచినారఁట.

వాసం—బాగున్నది. మఱియిప్పుడా రాజుగా రేమి చేయుచున్నారు?

ఆత్రే—అశ్వమేధయాగము చేయ నెంచినాఁడఁట?

వాసం—ఏమి ఏమీ! మఱల పెండ్లి గూడఁ జేసికొనెనా?

ఆత్రే—పాపము. పాపము. లేదు

వాసం—మఱి యాగవేదియందు సహధర్మ చారిణియో?

ఆత్రే—బంగారపు సీతాప్రతిమయఁట

వాసం—చిత్రము! ఎవరికెఱుక మహాత్ముల చిత్తములు? కులిశాయుధముకంటె ఘోరములు కుసుమములకంటెఁ గోమలములు తరువాత?

ఆత్రే—వామదేవాభిమంత్రిత మైన యాగాశ్వమును విడిచినారు—యథాశాస్త్రముగ దానికి రక్షకుల నేర్పఱచినారు. వారికి నియంతగా దివ్యాస్త్రసంప్రదాయ మెఱింగిన లక్ష్మణతనూభవుని చంద్రకేతునిఁ జతురంగ బలముతోఁ గూడఁ బంపినారు

వాసం—(ప్రేమానంద బాష్పములతో) కుమార లక్ష్మణునకుఁ గూడఁ గొడుకా? అమ్మయ్య బ్రతికితిని.

ఆత్రే—ఇంతలో నొక చిత్రము.

వాసం— అదేమి ?

ఆత్రే—బ్రాహ్మణుఁ డొక్కఁడు చచ్చిన కుమారునిఁ దెచ్చి రాజద్వారమునఁ బెట్టి ఱొమ్ము బ్రద్దలుకొట్టుకొనుచు గోలుగోలున నేడ్చెను. పిమ్మట రాజాపచారము లేనిదే ప్రజలలో నిట్టి యుప మృత్యువు సంభవింపదేయని కరుణాసముద్రుఁడు రామభద్రుఁడు

లోపము తనదిగానే నిరూపించునంతలో అశరీరవాణి యీవిధముగాఁబలికెను! "రామచంద్రా భూలోకమున శంబూకుఁడనునొకవృషలుండు తపమాచరించుచున్నాఁడు. వానిందండించి విప్రార్భకుని బ్రతికింపుము" అని-ఇదివిని కృపాణపాణియై పుష్పకవిమాన మెక్కి-బయలుదేఱి, జగత్పతి శూద్రతాపసికై యెల్లదిక్కుల శోధించుచున్నాఁడు.

వాసం—అవునమ్మా! ధూమపాయి శంబూకుఁడు ఈ జనస్థానమందే తపస్సు చేయుచున్నాఁడు. ఈమూలమున రామభద్రుఁడు తిరిగి యీవన మలంకరించునా ?

ఆత్రే—వాసంతీ! నాకుఁదడవైనది ఇఁకపోయివత్తును.

వాసం—కానిమ్ము. ఎండచాలయెక్కినది. (ఇరువురునిష్క్రమింతురు.)

ఇది శుద్ధ విష్కంభము.

(పిమ్మటఁ దపస్సమాధిలోనున్న శంబుకుఁడును కృపాణపాణియై రాముఁడును బ్రవేశింతురు.)

రాముఁడు (శంబుకునిజూచి)

రాము—ఆహా! ఈతఁడే యాశూద్ర తపస్వి! కాఁబోలు; ఔరా! ఈ తపోమూర్తి నిస్తరంగసముద్రమువలె నెంత గంభీరము (శంబుకునిసమీపించి)

ఉ॥ ఓ యతలోకయోగనియ ♦ మోజ్వల! యెవ్వఁడవీవు? దుర్ఘటం
బే యభివాంఛితంబునకు ♦ నిట్టి మహోగ్రతపం బొనర్తు, వ
న్నా! యెఱిఁగింపు మేకులము ♦ నం దుదయించినవాఁడవో, వివే
కాయతిఁ గన్నవాఁడవుగ ♦ దా మదిదాఁపవుగా, యథార్థముల్.

శంబు—(కన్నులు దెఱచి, లేచి)ధన్యోఽస్మి ధన్యోఽస్మి దేవా!

ఉ॥ అక్షరతత్త్వ బోధకుఁడ ♦ వైన జగత్పతి వీవు నాకుఁ బ్ర
త్యక్షముగాఁగ నింకను, య ♦ థార్థము దాఁపఁగ నంతపాపినా?

వీక్షణముల్ ఫలించె, విను ♦ మే వృషలుండను శంబుకుండ, నిం
దక్షయకాంతసిద్ధిఁ బడ ♦ యత్నదపియింతుఁ దృఢైకదీక్షమై॥

రాము—భద్రా! వృషలుండవైనను వివేకవంతుఁడవే, ఇది ధర్మ
విపర్యయంబని యెఱుంగవా?

శంబు—చ॥ ఎఱుఁగనివాఁడఁగాను జగ♦దీశ్వర! యీయుగధర్మమర్మమే
నెఱుఁగనివాఁడఁగాను మను♦జేశ్వర! నీవు రమేశ్వరుండవం
చెఱుఁగనివాఁడఁగాను దప♦మిట్టిది మాకు విపర్యయంబటం
చెఱిఁగి, యెఱింగి నీ వలన ♦నే మృతిఁగోరి తపంబె చేసితిన్॥

రాము—భద్రా! నావలన మృతియే యేలకోరుచున్నావు?

శంబు—మఱేదియు నక్షరసౌఖ్య మొసంగదుగాన.

రాము—దారుణమగు నాకరవాలముచే నీకట్టిసౌఖ్యము లభించునా?

శంబు—లభింపకేమి ప్రత్యక్షమేకదా!

ఉ॥ పాతకమూడ్చు నీచరణ ♦ పంకజరేణు వచేతనంపుఁజ
ట్రాతిని నాతిఁ జేయఁగఁ బ ♦ రాత్పర! నీదుకరాసి నా యవి
ద్యాతనుఁద్రుంచి యక్షరమ ♦ హత్తరకాయ మొసంగదా? జగ
త్త్రాతహరీ! యెఱుంగుదుఁగ ♦దా! భవతారక! నీమహత్వముల్॥

దేవా! ఆలసింపకుము. దండ్యుఁడు దండింపఁబడకుండుట రాజు
నకు దోషముకదా! నన్ను దండించువఱకు నిన్ను ప్రతిఘటించి, తప
మే యొనరింతు. కానిమ్ము, మనుమార్గ ప్రతిష్ఠాపకుఁడవు నీవిధి నిర్వ
ర్తింపుము. ఇదిగో నాశిరము.

రాము—హా! హా! కఠోరము రాజధర్మము.

మ॥ మనుమార్గంబిది యోసి దక్షిణకరం ♦ బా! విప్రసంతానమున్
మనుపన్మార్గంబిది కాన శూద్రమునిపై ♦ నన్ జిమ్ము కాంక్షేయక
మ్మనుమానింపక జానకిన్ సుగుణధ ♦ న్యన్ నిందుచూలాలి నే
వని కంపించిన రాముగాత్రమవు గా ♦ వా? జాలినీకేటికిన్॥

(అని ఖడ్గము ప్రయోగించును.)

శంబు—(దివ్యపురుషుఁడై) దేవా! రఘుకులేశ్వరా !

చం॥ యమునిఁద్రుణీకరించి యభయంబు ♦ బిడు దండ ధరుండవీవు వి
శ్వమునఁదుపర్ణగతాసుఁడల ♦ బాలుఁడు జీవితుఁడయ్యెనాకు మో
క్షమిటులభించె శంబుకుఁడ ♦ సాగిలిమ్రొక్కెద నీపదారవిం
దములకుఁ దారకంబులెగ ♦ దా యిలసాధులచేతిచావులున్॥

రాము—భద్రా! ఈ రెండును మాకుఁ బ్రియములే. ఇఁక నీయుగ్ర
తపంబునకు ఫలమనుభవింపుము.

గీ॥ పుణ్యములఁజేసి నిత్యప్ర ♦ మోదములును
శాశ్వతానందములు నెందు ♦ జరుగు నట్టి
తైజసములై వెలుంగు వై ♦ రాజనామ
భువనములు నీకు భోగ్యంబు ♦ లవును ధ్రువము॥

శంబు—ఈప్రభావము నాకు మీయనుగ్రహముచే లభించినదిగాని
నాతపస్సుచేఁగాదు, (యోజించి) ఆఁ కాకేమి ! తపస్సే
మహోపకారకమైనది, చూడుఁడు,

మ॥ నిను సర్వేశు, జగచ్ఛరణ్యు ఘను ల ♦ న్వేషింతు రట్లయ్యు, నీ
వె నితాంతశ్రమకోర్చిశూద్రుననున ♦ న్వేషించుచున్ నూఱుయో
జనము ల్వచ్చుటయేదియో యది తప ♦ స్సాఫల్యమే కానిచో,
నసఘా! వెండియు దండకాటవి కయో ♦ ధ్యన్ దాఁటి రానేటికో॥

రాము—భద్రా! దండకారణ్యమా యిది (పరికించి) అవునుగదా !

మ॥ లలితశ్యామలశాద్వలంబు లొకమోం ♦ లన్, భీషణాభోగజాం
గలముల్ వేఱొకచో, సరిద్గిరిఝరీ ♦ కల్లోలఝాంకారసం
కులదిక్కూలము లొక్కచోఁగలకెలం ♦ కుల్ తీర్థశైలాశ్రమం
బులకాంతారము లివ్వియే పరిచితం ♦ బుల్ దండకాభాగముల్॥

శంబు—దేవా! దండకయే యిది. ఇందుండియేకదా తామపూర్వము
ఖరదూషణత్రిశిరులను పదునాలుగువేల ముక్కడిరక్కసుల

నొక్కుమ్మడి సంహరించితిరి. అందుచేతఁగదా యీజనస్థానము సిద్ధక్షేత్రమై నావంటిభీరుజనమునకుఁగూడ నిర్భయసంచారము లభించినది చిత్తగింపుఁడు,

గీ॥ కలకలంబేమిలేక ని ♦ శ్చలతనున్న
యీ మహారణ్యసీమలం ♦ దిచటఁ గొన్ని;
కొన్నిదిక్కులుమాఱ్మ్రోయు ♦ చున్నవచటఁ
జటులనిర్ఘాతమృగచయా ♦ ర్భటులవలన ॥

గీ॥ భూరిగంభీరఘోషల ♦ బుసలతోడ
నాదమై నిద్రవోవు కా ♦ కోదరములు
బంధురశ్వాసపవనపా ♦ ణింధమములు
కాలకూటాగ్ను లివ్వోటఁ ♦ గ్రక్కుచుండు ॥

గీ॥ నేలబొరియలలోఁద్రాగ ♦ నీరు లేమి
నెండవేఁడిమి దూపిలి, ♦ తొండ లిందుఁ
గొండచిలువల చెమ్మటల్ ♦ గ్రోలుచుండు
భయదములు నిర్జలంబు లీ ♦ ప్రాంతరములు ॥

రాము—భద్రా! కనుబడుచున్నది. ఇది జనస్థానమే. ఇదే యాఖరాసురుఁడున్నచోటు. ఆహా! యానాఁటి వృత్తాంతములన్నియు నిప్పుడనుభవసిద్ధములై కన్నులంగట్టినట్లున్నవి. (తనలో) వైదేహీకారామసీమములన్న నెంతయో ముచ్చట. ఆకాంతారములే యివి. ఇంతకన్న నాకు భయానకములేవి? (సబాష్పము)

ఉ॥ ఈవనభూములన్ శ్రమ స ♦ హించుచు జానకిప్రేమమీర, "నా,
థా! విరిదేనతావులకుఁ ♦ దావల మీవని, మిమ్ముఁగూడి యా
హా విహరించుకంటెఁ గల ♦ దా మఱిసౌఖ్య" మటంచుబల్కెనా
భావనిరూఢమౌ ప్రణయ ♦ బంధము స్వానుభవైకవేద్యమౌ॥

గీ॥ ఎవని కెయ్యది ప్రియజనం ♦ బవునొ వాని
కదె యమూల్యఁపు వింతద్ర ♦ వ్యముగనలరు

ఏదియుంజేయ నక్కఱ • లేదు తనకు
అదిసరసనున్న నెల్లయా ♦ పకులు పొల్లగు

శంబు—దేవా! ఈయరణ్యములు దుర్గమములు తాముచూడఁదగినవి కావు. ఈపైవి మధ్యమారణ్యములు, మదకలమయూర కంఠ కోమలచ్ఛాయాదాయాదములైన పర్వతసముదాయములచే నావరింపఁబడి యున్నవి. చూడుఁడు. క్రిక్కిఱిసియున్న పచ్చని లేఁతచెట్ల గుబురులలోఁ బలుతెగల జింకకదుపులు జంకులేక తిరుగుచున్నవి. ప్రశాంతగంభీరములగు వీనియందు,

చ॥ బలుపుశకుంతముల్ పఱచి ♦ వ్రాలిన రాలెడు ప్రబ్బపూలతా
వులు నలువంక లాక్కటగు ♦ బుల్కొనుచల్లని తేఁటనీటితోఁ
గులుకుచుఁ బాఱు, జాంబవని♦కుంజములాఁగఁబండి, వ్రాలి త్రో
వలనరికట్టుటన్ గుభగు ♦ భధ్వనులన్ లహరీకదంబముల్॥

గీ॥ గుహల నంబూకృతములనర్చు • గున్నయెలుఁగు
టెలుఁగులవి మాఱుమ్రోఁత మ ♦ ఱింతలయ్యె
కరులువిఱిచినయొందుగుఁ♦ గణుపు లోద్చు
కమ్మతావులు కటుశి ♦రమ్ము లిచట॥

రాము—(కన్నీరు తొడుకొని) భద్రా! నీకు మార్గములు శుభములగుఁ గాక! విమాన మధిరోహించి పుణ్యలోకములకుం బొమ్ము.

శంబు—పురాణబ్రహ్మవాదియగు నగస్త్యభగవానుని సెలవుఁగైకొని శాశ్వతస్థానమునకుఁ బోయెదను. (నిష్క్రమించును)

రాము—ఈకారణమున మఱల నీకాఁతరముఁ జూడఁగల్గితిని. గేస్తు లమై యారణ్యకులమై మేముచిరకాల మిందు సాంసారికసౌఖ్య ములలో నోలలాడితిమి. మదకలమయూర కేంకార సంకులము లైన యీ పర్వతములే యివి. ఇవిగో మంజువంజులనికుంజాభి రంజితములగు నాఁటి యేటిదరులు. అవును.

గీ॥ అదియె కాంచోలు ప్రస్రవ ♦ ణాచలంబు
జలదమాలికవోలె ద ♦ వ్వులకునైన,
దెలియనగుచున్నయది (పరికించి) యగుట ♦ దీనిచెంత
భవ్య గోదావరీనది ♦ పాఱుచుండు॥

ఉ॥ ఆరయ దీనికొట్టకొన ♦ యందె జటాయువుగూడు, క్రింద నా
చేరువనుంటి మే ముటజ ♦ సీమల, శ్యామలతీరభూరుహ
శ్రీరుచి గౌతమిన్ బ్రతిఫ ♦ లించి చలించు మనోజ్ఞకాంతి కాం
తార మదే శకుంతకల ♦ నాదవ దంతరధామ రమ్యమై!

ఆపంచవటియు నిచ్చటనే. చిరకాల మిచటనే కాఁపురముండుటచే మావిస్రంభ సంభాషణముల కీప్రదేశములు సాక్షిభూతములై యున్నవి. ప్రియురాలి నెచ్చెలి యగు వాసంతియు నిచటనేకదా అయ్యో! ఈ రామహతకున కిప్పుడెంత యాపద సంభవించినది!

చ॥ తడవులనుండి మేన విస్త ♦ తంబయి పొంగు విషంబుమాడ్కి గా
సిడివలనన్ గలక్కుమని ♦ వేఁపెడి లోపలిశల్యఖండము
గ్రుడఁద వ్రణంబుమానియు న♦ దే మఱలన్ సెలవేసినట్లునాఁ
డడఁగినయట్టి శోక మిపు ♦ డైనటులే మనసున్ గలంచెడిన్॥

కానీ! పూర్వపరిచితములైన యీభూప్రదేశములనైనఁ జూచెదను. (నిరూపించి) అహహా! మాఱిపోయినదిగదా యీ భూమి సన్నివేశమంతయు;

మ॥ మును పెందుండెఁబ్రవాహ,మందుఁబులినం♦బుల్ నేఁడుగాన్పించుఁ,జె
ట్లనికాయంబున సాంద్రతావిరళతల్ ♦ మాఱ్పొందె, నెన్నాళ్లకో
కనుటంజేసి మఱొక్కకాన యను శం ♦ కల్గొల్పుచునేకాని, యా
వనియే యీవనియంచు రూఢి నచల ♦ వ్రాతంబు రూపించెడిన్

అయ్యో; తప్పించుకొని పోవుదమనుకొన్నను ఈ పంచవటీ స్నేహము నన్ను బలవంతముగ నాపుచున్నది.

మ॥ మును మేందేఁ బ్రియురాలితో బహుదినంబుల్ కాఁపురంబుండియుం
డనివోఁ కెచ్చటిగాథ లే సతత మింటం జెప్పుకొంచుందు మా
యనుఁగుం బంచవటీ! గటా! ప్రియవయస్యా మాపి, దుష్పాపినై
చని యేమోమునఁ గాంతు గానకెటుపేక్షం జేసిపోఁజాలుదుం

శంబు—(మఱలఁ బ్రవేశించి) జయము దేవా! అగస్త్యభగవానులు మీరాక నాచే నెఱింగి, ‘మీకిట్లాదేశించినారు. మహర్షులందఱు నీకొఱకు నిరీక్షించుచున్నారు. వత్సలయగు లోపాముద్రయు నీవు విమానమునుండి దిగునప్పుడు కావింపఁదగిన మంగళసంవిధానమును సిద్ధపఱచికొని నీరాక కెదురుచూచుచున్నది. కాన మమ్మెల్లర సంభావించి మఱి పొమ్ము’ అని

రాము—భగవానుని యాదేశ మెట్లో యట్లు జరిగించెదను.

శంబు—దేవా! ఇటు ఇటు.

రాము—భగవతీ! పంచవటీ! క్షమింపుము. గురుజనాదేశ మతిక్రమింపరానిదిగాన నొక్కక్షణకాల మీ రామునకు సెలవిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

—ఇది తృతీయాంకము—





శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము

చతుర్థాంకము.

(లోపాముద్రయు మురళయుఁ బ్రవేశింతురు)

లోపా—వత్సా! మురళా! ఎఱుంగుదువుగదా, మీనాయనగారి యాగమునకు వాల్మీకి భగవానులు, జానకితోఁ గూడ నిక్కడకు దయచేసిన విషయము?

మురళ—లోపాముద్రా భగవతీ! వాల్మీకులనేకాని జానకినిఁ జూడనే

లోపా—అవును! ఈవియోగావస్థలో నొరులకంటఁ బడకుండునట్లు బిడ్డకు వరమున్నదిలే.

మురళ—ఆలాగా! అట్లయిన జానకి యిచ్చటనున్నదన్నమాటయే?

లోపా—ఉన్నది. ఆమె యుపచారమునకు నిన్నే నియమించుచున్నాను

మురళ—కృతార్థురాలనే. రామభద్రుఁడుగూడ నిక్కడకరుదెంచినాఁడుగదా?

లోపా—అందుకొఱకే భగవతిగోదావరికి సందేశమంపితిని.

మురళ—ఏమని సందేశము?

లోపా—"ప్రేయసీవినిపాతమువలనఁగలిగిన దీర్ఘశోకసంతాపముచే, రామభద్రుఁ డిప్పుడు సగమైయున్నాఁడు. ఇక్కడనుండి యతఁడింటికిఁబోవుచుఁ బ్రేయసీచిరసహవాసవిస్రంభములకుసాక్షీభూ

తము లైయున్న పంచవటీప్రదేశములఁ జూడకమానఁడు.స్వభావముచేత నెంతధీరుఁడైనను నిట్టియవస్థలో నుప్పతిల్లుశోకసంక్షోభములు ప్రతి పదము ప్రమాదకరములు గానే యూహింపఁదగియున్నవికాన, రామభద్రుఁడు మూర్ఛిల్లునపుడెల్ల నీశీతలతరంగ చామరములఁ గమ్మని పిల్లతెమ్మెరలవీఁచుచు సేవ దీర్చుచుండుము” అని.

ముర—తల్లీ! ఆవాత్సల్యమునకు నీదాక్షిణ్యము తగియేయున్నది; మఱి సీత యెక్కడనున్నదో చూపుఁడు.

లోపా—గోదావరిమడుగునుండి బయలుదేఱినది.

గీ॥ పాలి నవసినచెక్కిళ్ళు ♦ ప్రేలు కురులు
చిన్ని మోమున శోకవింత ♦ వన్నెఁగూర్పఁ
గరుణమూర్తియొ మేనొన్న ♦ విరహదశయొ
యనఁగ వనికేగుదెంచె న ♦ ల్లదిగో సీత॥

నేఁ డాయుష్మంతులగు కుశలవులకుఁ బండ్రెండవ యేఁడువచ్చినది; కానఁ దత్సాంవత్సరమంగళగ్రంథి కట్టఁబడును. అందుకొఱకా మె దేవిభాగీరథి పంపున సూర్యభగవానుని బూజింపనేగుచున్నది.రమ్ము వత్సె ననుసరింతువుగాని (అందఱు నిష్క్రమింతురు)

—ఇది విష్కంభము—

(తెరలో) అమ్మయ్యో; ప్రమాదము, ప్రమాదము;
(అంతటఁ బూలఁగోయు నాసక్తితో సకరుణౌత్సుక్యముగా
సీత ప్రవేశించును).

సీత॥ —అహో! ప్రియసఖి వాసంతిమాటయే యిది.

(మఱలఁ దెరలో)

మ॥ మును జేమీఁదుగ,నందుగుం జిగురుమే ♦ పుల్మేపి! యల్లారుగో
మున సీతాసతి పెంచికొన్న కలభం ♦ బుంగున్న

సీత—ఆఁ దానికేమైనది ?

(మరలఁ దెరలో) స్వీయప్రియాం
గనతోఁ గూడ సరోవిహారముల సౌ • ఖ్యంబందుచో గర్వమె
క్కిన వేశోక్కగజంబు దాని నడిదాఁ • కెన్ దుర్మదోద్దండమై.

సీత—(తొట్రుపాటుతోఁ గొన్ని యడుగులునడిచి)ఆర్యపుత్త్రా! నాపుత్త్రకుని రక్షింపుము; రక్షింపుము. (స్మృతినభినయించి చింతతో) అయ్యో! మందభాగ్యురాలను. ఈపంచవటీదర్శనమునఁ జిరతరాభ్యాసవశములైన యీయక్షరములే నోటజారుచున్నవి. హా ఆర్యపుత్త్రా! (మూర్ఛిల్లును)

మురళ—(ప్రవేశించి) సఖీ! జానకీ! ఊఱడిలుము.

సీత—నెచ్చెలీ! మురళా, వచ్చితివా! ఎన్నాళ్లకు నిన్నుఁ జూచితిని. ఇటువంటి యవస్థలోనున్న నాసమాగమము నీకు మనోవేదనకే కాని సంతోషమునకుఁ గాదు గదా.

మురళ—సఖీ! చెలులు పంచికొన్నప్పుడే దుఃఖమునకు శాంతి.

(తెరలో)విమానరాజమా! ఇందే నిలువుము.

సీత—(విని, బెదరుపాటుతో) అహాహా! నెచ్చెలీ! జలధరధ్వానగంభీరమీ వాక్యనిర్ఘోషమెక్కడిదో, శ్రవణగోచరమైనతోడ మందభాగ్యను నాకుఁగూడ నేమో యీఅట కలిగించుచున్నది

మురళ—చెలియా! ఎక్కడిదో యవ్యక్తమైన యీనినాదమునకే యుఱుము విన్న మయూరివలె నింతసంభ్రమోల్లాసమేటి కేనీకు?

సీత—సఖీ! అవ్యక్తమందువేమి. సవ్వడింగట్టి గ్రహించినాను. నిశ్చయముగా నార్యపుత్త్రుని మాటయే యది

మురళ—కాఁబోలు, శూద్రతాపసిని దండించుట కైక్ష్వాకుఁడైన యారాజు దండకారణ్యమున కేతెంచినాఁడని, విందును.

సీత—బాగు ధర్మరక్షాతత్పరుఁడుగదా యారాజు.

(పిమ్మటఁ గరుణాశాలియై రాముఁడు ప్రవేశించుచు.)

సీ॥ పచ్చరాలపసిండి • భవనంబు లెచ్చోటి ఛాయానపాయ భూ • జములుమాకు
రమణీయమందిరా • రామంబు లెచ్చోటి విరిపందిరుల యేటి • దరులుమాకు
పలపించు పన్నీటి • జలదారులే కొండదొనల జాల్గొనుసన్న • సొనలుమాకు
ఇలవేల్పుచుట్టాల • బలగంబు లెచ్చోటి లీలాకురంగబా • లికలుమాకు
గీ॥ అట్టి మాపంచవటి యిదే • యల్లనాఁటి కాఁపురపుఁ జిన్నెలివె వీనిఁ • గాంచినంతఁ
మదిఁగుములుచున్న దుఃఖాగ్ని • మంటలెగయ మోహధూమంబయీనన్ను • ముట్టడించె॥

(తనలో) హా ప్రేయసీ! జానకీ!

మురళ—ఇదియే గురుజనము శంకించినది.

సీత—(రామునిజూచి)అమ్మయ్యో! గుర్తుపట్టుటకు సహజగంభీరాను భావమొక్కటిమిగిలియున్నది కాని, చూడు సఖీ,యీయార్య పుత్త్రుని మూ ర్తియీయిది. అయ్యో ! ప్రాతఃకాలచంద్రమండలమువలెఁ బాలిపోయి కృశించి, శరీరమెంత దుర్బలమైనది ! సఖీ! మురళా! నన్నుఁబట్టుకొనుము.

(చెలినిగౌఁగిలించుకొనిమూర్ఛిల్లును.)

మురళ—చెలీ! ఊఱడిల్లుము!

రాము—హా! దేవి దండకారణ్యావాస ప్రియసఖీ! విదేహరాజపుత్రీ !

(మూర్ఛిల్లును.)

సీత—అయ్యయ్యో! మందభాగ్యురాలిని నన్నే పేర్కొని మూఁతలు పడుచున్నకన్నుఁగల్వలతో నార్యపుత్త్రుఁడు మూర్ఛిల్లెఁగదా. చూడవమ్మా! యూపిరియు నాడక కటికనేలపైఁబడి యేమో విపర్యాసముగఁ దోఁచుచున్నారు. అయ్యో, మురళా! మురళా! రంక్షింపుము రక్షింపుము. నావిజీతేశ్వరు నెట్లయిన బ్రతికింపుము. (పాదములపైఁబడును.)

మురళ—కల్యాణీ; నీవేజగత్పతిని బ్రతికించికొనుము. నీకరస్పర్శమే కదా యీతనికి సంజీవనోపాయము పొమ్ము.

సీత.—ఏమైననుగానీ! ప్రాణసఖి చెప్పినట్లే చేసెదను (అని వేగిరపాటుతోం జని నేలపైఁ ద్రాలియున్న రాముని స్పృశించును)

రాము.— (ఆనందపారవశ్యమున నిట్టూర్పువిడుచుచు) ఆహా! ఏమిది! హాయి హాయి

చ॥ సలలితచందనద్రుమకి ♦ సాలరసప్రసరంబొ నిండు జా
బిలికి రసాంశు రావళులఁ ♦ బిండిన సారసుధాభిషేక మో
మలమలమాడునాయుసురు♦ ద్రాకిగురింపఁగ డెందమందు గ్రొం
జలువల జీవనౌషధి ర ♦ సాయన మల్లనఁ జిల్కరించిరో!

గీ॥ స్పర్శమిది యెక్కడిదొ పురా ♦ పరిచితంబె
చిత్తపరిమోహణంబు సం ♦ జీవనంబు
తాపమునఁ గల్గుసోలింతఁ ♦ బాపుఁగాని
తోన నానందమున సొక్క ♦ లోనె ముంచు॥

సీత—(కొంతహర్షముతో) అమ్మయ్య త్రిలోకనాథునకు మఱలఁ బ్రాణములు చేరుకొన్నవి. (భయకరుణములతో నవ్వలికిఁదొలంగి) ఇప్పటికీపాటిబహుకృతియే నాకుఁ జాలు.

రాము—(లేచికూర్చుండి) వత్సలయగు దేవి చేఁ బ్రసాదింపఁబడ లేదుగదా! కానీ వెదకెదను.

సీత—నెచ్చెలీ! ఆర్యపుత్త్రులు నన్ను గుర్తించిరేమో రమ్మావలకు. అభ్యనుజ్ఞ లేకయే నాయంత నేను గల్పించుకొనిన యీసన్నిధానమునకై, మహారాజెంతయోనాపైఁగోపించును.

మురల—ఓసి! వెలా! వాల్మీకివరప్రభావమున వనదేవతలకుఁగూడనీవగుపడవు జడియకుము.

సీత—అవును. ఆవర ముున్నదికదా.

రాము—హా! ప్రియసీ! జనకనందినీ!

సీత—(శోకముతోఁడి డగ్గుత్తికతో ఆర్యపుత్త్రా! జరిగిన వృత్తాంత మేమి, యీస్నేహసంభాషణమేమి? మురళా! వినుచున్నావు కదా! యేమహాభాగుని దర్శనము జన్మాంతరములకైన నను దుర్లభమని తలంచుచుందునో యట్టి ఆర్యపుత్త్రుఁడు మందభాగ్య నగు నన్నుద్దేశించి, యిట్లాక్రోశించుచుండఁ జూచి వజ్రమయ హృదయనై యేమని యీతనియెడఁ గాఠిన్యమువహించి యూరకుందును, చెప్పుము. ఎఱుంగుదుముకదా యీతనిహృదయము నేనును, నాహృదయ మీతఁడును. నెచ్చెలీ నన్నట్లు నిష్కారణముగఁబరిత్యజించినను నిప్పుడీవిధముగానున్న యీతనిఁజూచుచున్నప్పుడు నాహృదయావస్థ యెట్లున్నదని చెప్పుదును మురళా?

రాము—(కలయంజూచి) అయ్యో! ఇచ్చట నెవ్వరును లేరే. హా ప్రేయసీ! జానకీ!

గీ॥ తనువునగ్గి కొన్న సుప్రసా ♦ దంబనంగ
స్నేహరససీతలము నీదు ♦ చేతితాకు
వలని యానందమిప్పటి ♦ వఱకు విడదు
ప్రేయసీ! యింక సాక్షాత్క ♦ రింపవేల?

సీత॥—ఆహా! ఆర్యపుత్త్రుని యీశోకాలాపము లగాధదర్శితస్నేహ సంభారములు. ఆనందనిష్యందులు సుధామయములు. వీనియందలి విశ్వాసముచేతఁగదా, నిర్హేతుకపరిత్యాగశల్యమున వేధింపఁబడుచున్నను నాజన్మము చరితార్థమైనది.

రాము—లేదు లేదు; ఇచ్చట ప్రేయసియెక్కడిది. ఇది, సంకల్పపరంపరాభ్యాసముచే రామభద్రు నావరించిన కేవలభ్రాంతి.

(తెరలో) ప్రమాదము, ప్రమాదము.

('మ॥ మునుజేమీఁదుగ...అను పూర్వార్థము పఠింపఁబడును)

సీత—అక్కటా; ఇప్పుడెవరు రామాపీస్సిగజము నడగింతురు!

రామ—ఆ! ప్రియసీపుత్త్రకునిపై డీకొనుచున్న యాదుర్బుద్ధియెక్కడ?

వాసంతి—(తత్తరపాటునఁ బ్రవేశించి) ఏమీ! రఘునాథుఁడా!

సీత—ఏమీ! నా నెచ్చెలి వాసంతియా!

వాసం—దేవా! జయము జయము.

రాము—(నిరూపించి) ఏమీ! ప్రియసఖి వాసంతియా!

వాసం—దేవా! త్వరపడవలయు. ఇక్కడనుండి జటాయుశిఖరమునకు దక్షిణముగానున్న సీతాతీర్థముమీఁదుగా గోదావరిలోనికిం దిగి దేవీపుత్త్రకుని సంభావింపుము.

సీత—హాతండ్రీ! జటాయూ! నీవులేక యీజనస్థానమిప్పుడు పాడువడి పోయినదికదా!

రాము—హాహా! హృదయమర్మములఁ గోయుచున్నవే యీపూర్వ కథాప్రసంగములు.

వాసం—దేవా! ఇటు ఇటు

సీత—నెచ్చెలీ; మురళా! నిజమేసుమీ వనదేవతలుగూడ నన్నుజూడఁ జాలకున్నారు.

మురళ—మఱి సాధారణమా వాల్మీకివరప్రభావము?

సీత—అలాగైన వీరి ననుసరింతము రమ్ము. (పరిక్రమింతురు.)

రాము—భగవతీ గోదావరీ! నమస్కారము.

వాసం—(కనుఁగొని) దేవా! ఆనందింపుము వధూసహచారియై దేవీ పుత్త్రకుఁడు విజయోల్లాసమున నోలలాడుచున్నాఁడు

రాము—వర్ధిల్లుఁగాక ఆయుష్మంతుఁడు. దేవి; నీవుకృతార్థురాలవు.

శా॥ బాలక్రీడల నీవతంసలవలీ • పత్రంబు గైకొంచు ముం
బాలాంభోరుహనాళపల్లవములం • బాటించు నూనూఁగుదం
తాలం గ్రాలిన నీసుతుండితఁడు మా • ద్యద్దంతి నోడించి, నే
డాలంబించెఁగదా కుటుంబిని! వయో • ర్హంబైన కల్యాణముం

సీత—సౌమ్యదర్శనయగు తనప్రియురాలితో నీచిరంజీవి వియోగ మున్నది యెఱుంగకుండుఁగాక నెచ్చెలీ! ఇది యిట్టి వైనదికదా. ఇఁక నాకుశలవు లిప్పటి కెట్టివారౌదురో?

మురలా—సఖీ! ఇదియెట్టిదో వారును నట్టివారే యౌదురు.

సీత—చెలీ! ఎంతటియదృష్టహీనురాలను నేను; ఆర్యపుత్త్రవియోగమే కాక పుత్త్రవియోగముగూడనా? మురళా! నేను బిడ్డలంగన్న ఫలమేమి? మల్లెమొగ్గలవంటి పలుచని పలువరుసతోడను, మొలకనవ్వుల కేకిసలచే మిసమిసలాడు పాలబుగ్గలతోడనునంద గించునాపుత్త్రకుల ముఖారవిందములనార్యపుత్త్రుఁడు ముద్దాడు చుండఁగాఁ జూడకపోయితిని.

మురలా—సఖీ! చూచెదవు దైవానుగ్రహముచే;

సీత—ప్రాణసఖీ! బిడ్డలు తలఁపునకువచ్చి పాలిండ్లు చేఁపుటచే నిప్పుడు వారితండ్రిసన్నిధానమున నేనునుక్షణమాత్రముసంసారిణినైతిని.

మురలా—చెలీ! అబ్బురమా యిది? సంతానముకదా ప్రణయప్రకర్షమునకుఁ బరమావధి. తలిదండ్రుల పరస్పరానుబంధమును బిగి యించునది కానుపేకదా!

వాసం—దేవా! ఈదిక్కునఁ దిలకింపుఁడు

గీ॥ అపుడపుడె యంకురించు చి ♦ న్నారిపింఛ
మమరుతటి సీత పెంచిన ♦ నెమలి, యదిగొ
నీటుతలకుచ్చురత్న కి ♦ రీటమమరఁ
గొమ్మఁగూడి కదంబానఁ ♦ గూయు నిపుడు॥

రాము—ఆనందింపుము. వత్సా ఆనందింపుము.

సీత—అవును ఆనెమలియే యిది.

రాము—నాయనా! మయూరకుమారా!

మ॥ వలయంపు న్నటనక్రమంబు లెఱిఁగిం ♦ పఁ దారకాచంక్రమం
బుల గుర్తుల్ వెలయించు కంటికిఁ బలు ♦ భ్రూవల్లరీలాస్యముల్

దళుకులోఁ్వయఁ గరప్రవాళములఁదా ♦ శల్లప్రక్రియన్ సూపుచున్
జెలియాడించిన నిన్ను నాసుతునిగాఁ ♦ జింతింతు గా కర్మిలిన్॥

అహెూ! తిర్యగ్జంతువులుగూడఁబరిచయముమఱచిపోవుగదా!

గీ॥ కాంత మును బెంచునప్పుడీ • కడిమిగున్న
కొలఁది తొలిపూఁత చిన్నారి • గుమ్మటంబు

సీత—నిజమే. ఆర్యపుత్త్రులు చక్కఁగా గుర్తించినారు.

తే॥ స్వజనమునఁబోలె దీన హ ♦ ర్షంబుగనుచు
ఈగిరిమయూర మిట సీత ♦ నే తలంచు॥

వాసం—దేవర యిచటఁ గూరుచుందురు గాక

గీ॥ కదళికారామమున నీవు ♦ కాంతతోడ
మున్ను శయనించు చలువరా ♦ తిన్నెయిదియె
తేపుమాపిట సీత చే ♦ మేఁపులిడుట
హరిణకము లిప్పటికి దీని ♦ మరగి చనవు॥

రాము—సఖి వాసంతి; నే దీనింజూడ లేను. (ఏడ్చుచు నింకొకయెడఁ గూరుచుండును).

సీత—సఖీ, వాసంతీ; ఈప్రదేశము నార్యపుత్త్రునకు నాకును జూపి యేమిపనిచేసితివే. అయ్యో! ఆ యార్యపుత్త్రుఁడు, ఆ పంచవటి ఆ ప్రియసఖి వాసంతియునా? అక్కటా! జీవలోక పరివర్తన మీలాగై పోయెనా! హా! దైవమా! ‘నేను లేకయీతఁడును, ఈతఁడులేకనేనును’ అని కలయందైన నెవ్వరుదలంచిరి. సాకిదియొక జన్మాంతరావస్థకాఁబోలు. నేఁటికైన నాయందనుగ్రహముచేఁ గానంబడిన నాజీవి తేశ్వరుని బాష్పసలిలధారావ్యవధానముల యందుఁజూచి కొనుచుందును.

మురళ—సఖీ జానకీ! చూచికొనుము. వెల్లివొడుచుచున్న ఆనంద శోకాశ్రుపూరములతోఁ బ్రేమామృతమును వర్షించుచున్న నీ చూడ్కి పాల కాలువవలెఁ బ్రియుని నోలలాడించుఁగాక.

వాసంతి—

మ॥ ఫలపుష్పార్ఘ్యములొసంగుఁగావుత, తరు ♦ వ్రాతంబు క్రొందేనియల్
వళితాంభోరుహసౌరభంబుల, వనాం ♦ తర్వాయువుల్ వీచుతన్
కలగానంబు లొనర్చుఁగావుత విహం ♦ గశ్రేణి సోత్కంఠమై
చెలిమిన్ వెండి మహానుభావుఁ డరుదెం ♦ చెన్ రాముఁడీకాననన్ ॥

రామ:—సఖీ! వాసంతీ! ఇక్కడఁ గూరుచుండుము.

వాసంతి—(కూర్చుండి కన్నీళ్ళతో) మహారాజా! కుశలమా కుమార లక్ష్మణునకు ?

రాము—(వినమి నభినయించి)

మ॥ తఱితోలేచి, కరారవిందములు కం ♦ దన్ సీత నీర్వోసి, ని
వ్వరులన్ మేపి కుశాంకురంబులిడి, పెం ♦ పన్ సొంపువాటించు నీ
తరుసారంగవిహంగమప్రముఖసం ♦ తానంబుగన్గొన్న దు
ర్భర మీగుండె కఱంగి నీరగువికా ♦ రంబేదొ నన్నేఁచెడున్॥

వాసం—మహారాజా! నిన్నే అడిగినది. కుశలమా కుమారలక్ష్మణునకు?

రాము—(స్వగతము) ఓహో! "మహారాజా" అని ప్రేమలేని యామంత్రణము నాకును, సౌమిత్రియెడ మాత్రము బాష్పగద్గదాక్షరముగాఁ గుశలప్రశ్నమునా? ఇందువలన సీతాపరిత్యాగవృత్తాంత మీమెకుఁ దెలియవచ్చినదనియె తలంపవలెను. (ప్రకాశముగా) ఆఁ కుశలమే కుమారునకు.

వాసం—ఓ దేవా! ఏమందును! క్రూరుఁడవై పోయితివే.

సీత—సఖీ వాసంతీ! నీవే యిట్లాడుచుంటివేమి? ఆర్యపుత్త్రుం డెల్లరకుఁ బ్రేమపాత్రుఁడై యుండ విశేషించి నీకుఁ జెప్పవలయునా?

వాసం—ఆహా! ఎన్నియిచ్చకము లాడితివి. ఎన్నినయగారములు వెల్లడించితివి?

చం॥ అమలమతీ! మదీయహృద ♦ యంబునకుం హృదయంబ వీవు, ప్రాణమునకుఁ బ్రాణమీవు, నయ ♦ నంబులఁ జంద్రిక వీవు, గాత్రమందమృతరసంబ వీ వనుచు, ♦ నమ్మెయి నన్ని ప్రియంబు, లన్నితీయము లని, యావిముగ్ధ నిక ♦ దా! (మూర్ఛిల్లిలేచి)
యిఁక నేఁదుల కాప్రసంగముల్॥

రాము—సఖీ! ఊఱడిల్లుము.

వాసం—దేవా! ఇంతటియకార్య మొనరించితివేమి?

సీత—వాసంతీ చాలు నూఱకుండుము.

రాము—లోకము సైరింపదని, ..

వాసం—అది యేమికారణమున?

రాము—ఏమో దానికే యెఱుక

మురల—నిందింపవలసినదే లోకమును.

వాసం—ఏమిమాట యిది?

ఉ॥ ఓయి కృపావిహీన! యశ ♦ మొక్కటియే గద నీకభీష్ట, మత్యాయత మింతకంటెఁ గల ♦ దా యిల ఘోరతరాపకీర్తి, యన్నా! యటవీస్థలిం బడి య♦నాథ, మృగేక్షణ యేమియయ్యెనో హా! యధినాథ! యెంతపని ♦ కోర్చితి వేమనుకొంచునుందువో॥

సీత—సఖీ వాసంతీ! అనరాదుగాని నీవే దారుణవు కఠోరవును క్షోభించుచున్న యార్యపుత్త్రుని మఱింత క్షోభింపఁ జేయుచున్నావు.

రాము—

మ॥ చెలి! యింకేమని తెల్పుదుం సతిగతిం ♦ జేకొం గానలోఁ జిక్కి, విహ్వలయై తల్లికిఁ బాయు లేడిపసిపా ♦ పంబోలి, నీరాడు ప్రౌఢులగర్భం బతిభారమై జవజవం ♦ దూఁగాడుచోఁ బండువెన్నెలకుం బోలుతదీయకాయలతికం ♦ ద్రింగెం వనీసత్త్వముల్॥

సీత—ఆర్యపుత్త్రా! ఇదిగో నేను బ్రతికియే యున్నాను.

రాము—హా ప్రియా! జానకీ! యెక్కడనున్నావు?

రాము—అయ్యో, అయ్యో, ఆర్యపుత్త్రులు నాకొఱకై వాపిడిచి యేడ్చుచున్నారు గదా!

మురః—చెలీ! జానకీ! ఇప్పు డింతకంటెఁ గర్తవ్యము లేదు. దుఃఖితులు దుఃఖోపశమనము గావించుకొనవలసినదే,

గీ॥ వఱదవడి, దట్టముగ గట్టు ♦ లొరయు నపుడు
గండి తెఱచినచోఁ దటా ♦ కంబు తెగదు
విపుల శోకంబుచేత క్షో ♦ భించునపుడు
బిట్టు విలపించుచో గుండె ♦ బ్రీలిపోదు॥

రాము—అక్కటా! ఈ రామభద్రుని జీవయాత్ర యెటుఁ జూచినను గష్టభూయిష్ఠమై పోయెనే.

మ॥ ధరణీపాలనమా, యథావిధిగఁ గ ♦ ర్తవ్యంబు, తాదృక్ప్రియా
విరహంబా మిడియెండ కొవ్వారినటుల్ ♦ వేగించుఁ జైతన్యముల్
బరివర్జించి తనంత, నేఁ బ్రటకునై ♦ నన్ బ్రాప్తియూ లేదు, సం
ప్పరవుం గుండెభరంబుదీఱ నిపుడే ♦ ద్వాంగ్లై మేలేకదా!

హా హా దుర్భరము దుర్భరము—

శా॥ వ్రీలున్ గుండియ శోకతీవ్రత ద్విధా ♦ భిన్నంబుగా చింతకున్
గూలున్ మేనుగలంగి మోహమునఁ బో ♦ న్కాదింకఁ జైతన్యముల్
గాలున్ నిల్వన దేహ మాంతరశిఖన్ ♦ గాదింతకుం బూది యి
స్సీ! లోమర్మము లంటఁ గోయు విధి వి ♦ చ్ఛేదింప దీజీవముల్॥

సీత—ఇటువంటిదే యీదుఃఖము.

రాము—ఓనాయులారా! పౌరజానపదులారా!

మ॥ అనుకూలింపక పోయె దేవి భవనం ♦ బందుంటయే మీకుఁ గా
నని కొనన్ దృణమట్లువీడి, లవమై ♦ నన్ వెన్కఁ జింతింప, నేఁ

డనుభూతప్రియబాంధవంబులగునా ♦ యాభావమ్ము మానసం
బున రేఁగఁ విలపింతునియ్యెడ క్షమిం ♦ పుండయ్య నే దీనుఁడఁ॥

మురళ — ఈశోకసాగర మతిగంభీరము.

వాసం — దేవా! గడచినదానికై వగచి యేమిప్రయోజనము? ధైర్య మవలంబింపుఁడు

రాము — సఖీ వాసంతీ! ఇంకను ధైర్యమనుచున్నావేమి?

గీ॥ జానకీశూన్యమైన యీ ♦ జగతియందుఁ
బదియు రెండేండ్లు కాల మి ♦ ప్పటికిజరిగె
'సీత' యనుపేరుగూడ న ♦ శించిపోయె
'రాముఁడు నశించె' ననుమాట ♦ రాకపోయె॥

సీత — అయ్యో మురళా! ఆర్యపుత్త్రుని యీవిలాపములచే నేను విమూ ఢనై పోవుచున్నాను.

మురళ — నెచ్చెలీ! నిజమే స్నేహార్ద్రశీతలంబులయ్యు శోకనిష్ఠురములగు టచే నీకీపలుకులంతహృద్యములుగావు. ఏలయన నివి యెల్లవిష రసమలీమసములైన తేనెసోనలై నీమీఁదఁ గురియుచున్నవి.

రాము — సఖీ! వాసంతీ! ఇంకెంతకాలము సైరింతును.

మ॥ నరముల్ గాడఁగనాటుకొన్నవిపదం • ట్ప్రింబోలి; డెందాన ని
ష్ఠురతఁ గ్రుచ్చి మెల్లఁ మలంచుకొఱకం ♦ చుంగాలముంబోలి దు
ర్భరమై దారుణశోకకీల మిటుమ ♦ ర్మచ్ఛేణులంబట్టి యే
డ్తెఱమై చీల్చుచునున్న నోర్చుకొన లే ♦ దే మొండినై నెచ్చెలీ!

సీత — అక్కటా! ఎంతటి మంద భాగ్యురాలను; ఆర్యపుత్త్రున కీవిధ ముగ మాటిమాటికి నాయాసము కలిగించుచున్నాను.

రాము — సఖీ వాసంతీ! ఈవిధముగ నంతఃకరణమును జలియింపనీక యెంత చిక్కబట్టుకొనియున్నను బూర్వానుభూతములగు నా యావస్తువుల సందర్శించుటచే నిప్పుడు నా కీ సంక్షోభము తటస్థించినది. ఈయావేగము నరికట్టుటకు నే నెట్టి గట్టియత్న

ము లొనరించుచున్నను నవియెల్ల, మహాపరివాహరయము నందు, సైకతసేతువువలె భిన్నములై బలత్కారమగు కొం డొక వికారమే నన్నావరించుచున్నది !

సీత—అయ్యో ! దుర్వారవిప్లవారంభమగు నార్యపుత్త్రుని యీ దుఃఖసంక్షోభముచే నాహృదయము, తనదుఃఖావస్థను మఱచి పోయి కలగుండు వడుచున్నది !

వాసం—(స్వగతము) ఈ మహానుభావుఁ డత్యాపన్నుఁడై యున్నాఁడు; కావునఁ బరిసంగాంతరమున సీతని హృదయము మఱల్చెదను. (పరికాశముగ) దేవా ! పూర్వానుభూతములైన జనస్థాన ప్రదేశముల నించుక పరికింపుఁడు.

రాము—అట్లేకానిమ్ము (లేచి పరిక్రమించును.)

సీత— ఆహా ! ఈవాసంతి దుఃఖోద్దీపకములనే వినోదోపాయములని భ్రమించుచున్నది.

వాసం—దేవా ! జ్ఞాపకమున్నదా ?

మ॥ కనుగొమ్మాపొదరింటనే చెలియరా ♦ కన్ వేచియున్నావు, మా
నిని గోదావరిరేవునం దిసుక తి ♦ న్నైన్ హంసలన్ జూచువే
డ్కనుజాగై చనుదెంచు చీపు పొలయ ♦ ల్కంగొంటివోనాఁదలం
చి నవాంభోరుహకోరకాభము ధచిం ♦ చెన్ భీతిముగ్ధాంజలిన్॥

సీత—వాసంతీ ! కఠినురాలవుగదా నీవు; హృదయమర్మశల్యములఁగద లించు నీలాటివృత్తాంతములతో మాటిమాటికి మందభాగ్యు రాలిని నన్నును, ఆర్యపుత్త్రుని సంతసింపఁజేయుచున్నావు.

రాము—హాచండీ ! జానకీ ! ఇందందుఁ గానఁబడుచున్నట్లుండియు జాలి వహింపవుగా !

శా॥ హా దేవీ ! హృదయంబుభిన్నమగు, వర్మంబు దేహబంధంబులున్
లేదయ్యెన్ జగమే, దహించు నమితా ♦ గ్నిజ్వాల లోలోపలన్

మీఁదుంగ్రిందు నెఱుంగకాత్మము తమోంధీభూతమైపోయె హా!
హా! దౌర్భాగ్యుఁడ నేమి సేయుదు, విమోహాంభోధిలో మున్గితిన్॥

(అని మూర్ఛిల్లును)

సీత—అయ్యో అయ్యో! ఆర్యపుత్త్రుఁడు మరల మూర్ఛపోయినాఁడు

వాసం—దేవా! ఊఱడిల్లుము. ఊఱడిల్లుము.

సీత—హా జీవితేశ్వర! సకలలోకైక కళ్యాణమూర్తివైన నీవు, మంద భాగ్యురాలనగు నానిమిత్తమై మాటిమాటికి జీవితసంశయ దారుణంబగు నీలాటి యవస్థాపరిణామము ననుభవించుచుంటివే. సఖీ మురళా! ఇఁక నే బ్రతుకలేను.

మురళ—చెలియా! ఊఱడుము. మరల నీకరస్పర్శమే రామభద్రునకు సంజీవనోపాయము.

వాసం—అయ్యో, ఇఁక నేమిగతి, ఇప్పటికిని మూర్ఛ దేఱకున్నాఁడు హా ప్రియసఖీ! జానకీ! నీప్రాణేశ్వరు నింకను సంభావింపవేమి? (సీత తత్తరపాటుతో సమీపించి రాముని హృదయమునందును, నెన్నొసటియందును స్పృశించుచున్నది.)

మురళ—అమ్మయ్య రామభద్రునకు మరలఁ బ్రాణములు చేరుకొన్నవి.

రాము—ఆహా! ఏమిది!

గీ॥ తనువునందున్న లోపలి ధాతువులను
అమృత రసలేపముల నోల నార్చినట్లు
స్పర్శ మేదియో మరల జీవం బొసంగి
ముంచె నాకస్మికానంద మూర్ఛలోన॥

సఖీ వాసంతీ! అదృష్టవంతురాలవు.

వాసం—ఏమి యేమి?

రాము—మఱేమున్నది. జానకి దొరకనే దొరికినది.

వాసం—రామచంద్రా! ఆమె యెక్కడ?

రాము—(స్పర్శసుఖమనుభవించుచు) ఇదిగో యెదుటనే యున్నది.

వాసం—ఓయీ! ప్రియసఖీవియోగదుఃఖమున నిదివఱకే దహింపఁ బడుచున్న యీమందభాగ్యురాలిని, మాటిమాటికి మర్మచ్ఛేద కఠోరములగు నీలాటి ప్రలాపములచే నేలదహించెదవు?

సీత—ఆహా! అవ్వాలికిఁదొలంగి పోఁదలంతుఁగాని, అంతటి దీర్ఘమత్సర మైన నాసంతాపమునుగూడ రవంతలో నడఁగించునదై, చిరతర స్నేహప్రసన్నశీతలంబై యున్న యార్యపుత్త్రుని యీకరస్పర్శ ముచే వజ్రమయమగు టంకమున నతికింపఁబడినట్లు నాహస్త మీవలకు రాకున్నదే!

రాము—సఖి వాసంతీ! ప్రలాపములు గావు నిజముగ సీతదొరికినది.

చ॥ పరిణయవేళఁ గంకణ శు ♦ భంకర మేకర మందికొంటి, నే
కర మనుభూతమయ్యెఁ జిర ♦ కాలమునాకు, యథేచ్ఛమై సుధా
ఝురశిశిరంబులైన యుప ♦ చారములన్ గరకాతుషారసుం
దరలవలీప్రవాళలలి ♦ తం బిపుడాకర మేగ్రహించితిన్॥

సీత—అయ్యో అయ్యో! ఆర్యపుత్త్రసంస్పర్శమువలని విమోహముచే నాకుఁ బ్రమాదము సంభవించెనే!

వాసం—అకటా! ఉన్మాదమే

సీత—(సంభ్రమమున విడిపించుకొని యవ్వలికేగును)

రాము—హా; హా; వాసంతీ! ప్రమాదమేయైనది.

వాసం—దేవా! ఏమి ఏమి?

రాము—ఇంకేమున్నది.

గీ॥ జడము, ప్రస్వేదకంబు, చం ♦ చలమునైన
సకియ చిగురాకుఁజే యిట్టి ♦ జాఱిపోయె
జడము ప్రస్వేదకంబు చం ♦ చలమునైన
నాకరమునుండి యున్న దు ♦ న్నటులె యుండె॥

సీత—అయ్యయ్యో! ఆర్యపుత్త్రుఁడిప్పటికినిఁ దన్నుఁదాఁ దెలిసికొన నేర కున్నాఁడు. నేత్రములకింకను నైజవిలాసముతాలేదు. కను

జూపులు నిశ్చలములై యెదుటనున్న విషయమునుగూడ సం
గ్రహింపనేరక యూరక ఘూర్ణమానము లగుచున్నవి.

మురః—(సస్నేహకౌతుకమున సీతను నిరూపించి)

గీ. నాతిమేను ప్రియస్పర్శ ♦ నాతి హర్ష
మునను జలియించి, చెమరించి ♦ పులకరించెఁ
బవనమునఁ దూఁగి తొలకరి ♦ వానఁదోఁగి
కోరగించుకదంబంపుఁ ♦ గొమ్మవోలె॥

సీత—ఓహో! "పరిత్యజించిన మగనిపై దీనికింత యనురాగమేమి" యని మురళ నన్నుఁజూచి యేమనుకొనుచున్నదో యని నాకు సిగ్గగుచున్నది,

రాము—హా! ఏమిది జానకి లేనే లేదే! ఓసీ నిర్దయురాలా! వైదేహి!

సీత—ఆ నిజముగా, నేను నిర్దయురాలనే, ఇట్టియవస్థలోనున్న మిమ్ముఁ జూచుచుండియు జీవించియున్నాను.

రాము—హా ప్రేయసీ; ఎందున్నావు? అనుగ్రహింపవా? ఇట్టినన్ను విడనాడిపోవుట నీకుఁదగునా?

సీత—ఆర్యపుత్త్రా! విపరీతము గాదా యిట్లనుట?

వాసం—దేవా శాంతింపుఁడు, మేరమీఱిన వియోగదుఃఖముచేఁబరవశమైన మీహృదయమును, లోకోత్తరమైన మీధైర్యముచేత నే కుదుటఁబఱచికొనుఁడు. ఇక్కడ నాప్రియసఖి యెక్కడిది?

రాము—నిజమే, లేదు; ఉన్నచో వాసంతికైన నగపడదా? ఇది స్వప్న వృత్తాంతమేమో! నేను నిద్దురపోలేదే! మొదలు రామునకు నిద్రయెక్కడిది? ఇదినిశ్చయముగా నిరంతరసంకల్ప పరంపరలచేఁ గల్పింపఁబడిన కేవల చిత్తభ్రాంతి. ఇదే సర్వథా నన్ను వెన్నాడుచున్నది.

సీత—కఠినురాలను నేనే యార్యపుత్త్రుని మోసగించితిని.

వాస—దేవా! చూడు చూడు,

మ॥ ఉరుశైలేంద్రము నత్యుగ్రథకుండిదె, జటా • యుర్విచ్ఛిన్నభిన్నాంగుఁడు; త
త్తరసాహాంకములవే, పిశాచముఖులుల్ • కంకాళశేషాంకముల్;
పరుఁడిచ్చోట జటాయుపక్షయుగముల్ • ద్రావ్యాతించి రోషోజ్జ్వల
ద్ధరణీజం గొనిపోయె మింటఁ జలదం • తర్భించలాంభంబునన్ ॥

సీత—(భయముతో) హా! ఆర్యపుత్త్రా! తండ్రి వధింపఁబడుచున్నాఁడు రక్షింపుము రక్షింపుము. నేనపహరింపఁబడుచున్నాను.

రాము—(క్రోధమున) అరేపాపీ! తాతప్రాణసీతాపహారీ! ఎందుఁ బోయెదవురా?

వాసం—దేవా! రాక్షసకులప్రళయధూమకేతూ! ఇప్పుడును నీక్రోధమున కాస్పదముకలదా?

సీత—అహా! ఉన్మత్తునైతినే!

రాము—ఇప్పుడు నిజముగాఁ బ్రలాపమే చేసితిని. ఇప్పటి వైపరీత్య మట్టువంటిదికాదు. ఇది వేఱువిధమైనది.

ఉ॥ ఆవిరహంబు పాయునివ • హాంబుల నిత్యవినోదహేతుకం
బై, వివిధోగ్ర సంగర వి • హారములన్ జగదద్భుతావహం
బై, విసువేది శాత్రవవ • ధావధి సైఁపఁగనయ్యె ము, న్నదియో
ఈవిరహాబ్ది కేయవధి • యేది ప్రతిక్రియ నేఁడు సైఁపఁగన్॥

సీత—అహా దీని కవధియే లేదుగా! హా మందభాగ్యురాలను చెడిపోయితిని. (ఏడ్చును.)

వాసం—దేవా: దీనికిఁ బ్రతిక్రియయే లేదా!

రాము—ఇంకేమి ప్రతిక్రియ వాసంతీ!

సీ॥ కపికులేశ్వరుని స • ఖ్యం బెందుఁగోలఁగాదు కపిసేన లెచట న • క్కఱకురావు
జాంబవన్మతికి లే • శం బెందుఁ బని లేదు హనుమంతుఁ డేని యెం • దరుగలేఁడు
ఎచట సేతువునకుం • జేని నిర్మింపలే • దలవిశ్వకర్మ నిం • దరుగఁడెందు
సౌమిత్త్రిబాణసం • చయ మెందుఁ జొరలేదు నాశక్తి యెందు య • త్నంబులేదు

గీ॥ అకటకటా! యట్టిదుర్గమం • బైనచోట నెచటనున్నావె జానకీ! • యెందుఁగన్నఁ
ప్రాణములఁగోసియిడునింత ♦ బలగముండి ప్రేయసీ! నీయవస్థ త • ప్పింపలేరు॥

సఖీ వాసంతీ! ఇప్పుడు రామదర్శనము సఖులకు దుఃఖము కొఱకే. ఇక్కెంతకాలము నిన్నేడిపింతును. సంకల్పితమగు నశ్వమేథము నిర్వహించుటకై శీఘ్రముగఁ బోవలసియున్నది. కాన నాకుఁబయనమున కానతిమ్ము.

సీత—(ఉద్వేగముతో మురళం గౌఁగిలించుకొని) అయ్యోమురళా! ఆర్యపుత్త్రుఁడు వెడలిపోనే పోవుచున్నాఁడు. నాకింకేమిగతి (మూర్ఛిల్లును.)

ముర—చెలీ! జానకీ! ఊఱడిల్లుము. ఆయుష్మంతులగు కుశలవుల వర్షవర్ధనమహోత్సవము నిర్వర్తింప, భాగీరథీపదసన్నిధానమునకు మనమును బోవుదము రమ్ము.

వాసం—పాపము శమించుఁగాక! అశ్వమేథ నిర్వహణమా? మఱి సహధర్మచారిణి యెవరు?

రాము—ఉన్నదికదా బంగారపు సీతాప్రతిమ.

సీత—(నిట్టూర్చి కన్నీటితో) ఆహా! ఆర్యపుత్త్రుఁడవే యిప్పుడు నీవు. ఇప్పుడు నాపరిత్యాగశల్యము లాగివేయఁబడినది.

రాము—దానింజూచుకొనుచునైనను బాష్పపూరితమైన నా నయనమును గొంతవినోదింపఁ జేసికొందును.

సీత—ఆహా! ఆర్యపుత్త్రునిచే బహుమానింపఁబడుచున్న యాప్రతిమ ధన్యగదా. అది ఆర్యపుత్త్రుని వినోదింపఁజేయునదై జీవలోకమునకెల్ల నాశానిబంధనమైనది.

ముర—(చిఱునవ్వుతోడను, స్నేహబాష్పములముతోడను గౌఁగిలించి) సఖీ! నిన్ను నీవే పొగడుకొనుచున్నావు.

సీత—(లజ్జతోఁదలవంచి) మురళి నన్నుఁబరిహసించుచున్నది.

వాసం—దేవా! ఈసమావేశము మాకు మహాప్రసాదము. కార్యభంగము కాకుండునట్లు ప్రయాణ మనుసంధింపుఁడు.

సీత—అయ్యో ! నాకిప్పుడు వాసంతి ప్రతికూలయయ్యెనే.

మురళ—చెలియా రమ్ము పోవుదము.

సీత—(కష్టముతో) వచ్చుచున్నాను. దుర్లభదర్శనుని క్షణమాత్రము చూచుకొందును. (పోవుచు) అపూర్వపుణ్యపరిపాకముచేదర్శన మిచ్చిన యార్యపుత్త్రుని పాదపద్మములకిదే నమస్కారము.

(మూర్ఛిల్లును)

మురళ—సఖీ ! ఊఱడిల్లుము లెమ్ము.

సీత—మేఘాంతరమందలి పూర్ణచంద్రదర్శన మెంతసేపు ?

రాము—విమానరాజమా ! ఇటు ఇటు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తర రాఘవము.

## పంచమాంకము.

(వటువులతో కుశలవులు పాడుచు ప్రవేశించుచున్నారు.)

### గేయము.

రామ—సకలగుణధామా - అంకసంయమా - రఘుకులసోమా ॥పల్లవి॥
ధామా రాజలలామా - కలుషవిరామా దశరథరామా ॥జయ॥
తాపసయాగవి - దారణదారుణ- దైత్యవిభంజనరామా ॥ పురహర ॥
చాపవిపాటన - పాటవ, ధరణీ - జారమణీవర రామా ॥ జయ ॥
పరశురామ బల-భంజనరామా - ప్రముదితపార్థివరామా ॥రామా॥
పరిపాలిత గురు-వచనా, వనసం-చరణా, మునిజనశరణా ॥జయ॥
ఖరదూషణముఖా - సురసంహరణా - శరణాగత కపిభరణా ॥ రామా ॥
శరనిధిబంధన సురరిపుభంజన - జగదభిరంజన రామా ॥జయ॥

గాలవుడు—కుశలవులారా ! మీరు వేయేండ్లు వర్ధిల్లవలయు !

లవు—అయ్యా ! ఈయప్రస్తుతాశీర్వచన మెందుకు ?

గాల—అప్రస్తుతమేమి ? నేటి కైదు దినములనుండియు మీవర్షవర్ధన మహోత్సవములు జరుగుచున్నవి ? వానితోపాటు యథేచ్ఛగా మాకీ యనధ్యయన మహోత్సవములును !

కుశ—వానికేమి కాని గాలవా తెలియక యడుగుచున్నాను. వెనుకటి పాఠములేమైన స్ఫురణలో నున్నవా ?

గాల—మిత్రుఁడా? వెఱ్ఱివాఁడవుగదా? వెనుకటివి వెనుకకుఁబడియుండక ముందుకకుఁబడునా ?

కుశు—ఏమీ ! అప్పుడప్పుడు వెనుకటివి చింతించుచుండవా ?

గాల—మొదటనే తెలివితేఁట లుండవలయునుగాని, వెనుక జింతించుట వెఱ్ఱితనముకాదా ?

లవు—వివేకవంతుఁడవు. పోనీ ఈమధ్యఁజదివిన ఇంద్రజిత్తుయుద్ధఘట్టములోని శ్లోకములైన జ్ఞాపకమున్నవా ?

గాల—సాయనా! ఈ యుద్ధకాండ మేవేళఁ బ్రారంభించితిమో కాని కంటికింత హాయిగా నిద్దురపోయి యెఱుఁగనుగదా?

లవు—అంతదీక్షగఁ జదువుచున్నావా?

గాల—చదువు లేదు చట్టుబండలులేదు,కన్ను మోడ్చుటయే తడవుగా, లంకలోని దిక్కుమాలిన రక్కసిముండకొడుకులందఱు, నానా వికృతాకారములతోనాకు సాక్షాత్కారమగుచున్నారిదేమి కర్మము.అయ్యో! అయ్యో ! ఆవ్యాఘ్రఘూననాలేమి! ఆమార్జాలనేత్రా లేమి!ఆలొట్టిపిట్టవీఁపులేమి!ఆ బారముక్కులేమి!ఆపారపండ్లేమి ! ఆ చీరపేల జుంజురువెంట్రుకలేమి! ఆనవ్వులేమి ! ఆ కేకిసలేమి ! హనుమ్మనువాఁడొకఁడు హమ్మను వాఁడొకఁడు బాబూ అనరాదుగాని రామాయణయుద్ధకాండపారాయణమునకు ఫలముగా నన్ను బ్రహ్మరాక్షసపిశాచములుపట్టి వేధించునేమోయని లోలోపల నడలిచచ్చుచున్నాను.

కుశ—గాలవా! ఇదే వాల్మీకిభగవంతుని కవితా రహస్యము.

గాల—ఏది! బ్రహ్మరాక్షసపిశాచసాక్షాత్కారమా ?

కుశ—కాదు, వర్ణితాంశములనెల్లఁ జదువరులకుసాక్షాత్కరింపఁజేయుట.

గాల—అదా? ఆలాగైన నాతోఁబాటీగొడవ మీకును సంభవించిన దన్నమాటయే?

లవు—అయ్యో! గొడవ యేమి, రసపారవశ్యము, తన్మయత్వమన నిదియే కదా, చెప్పుము, రాక్షసులతో బాటు సుగ్రీవాది వానరపుంగవులు నీకుఁ గన్పించుట లేదా!

గాల—నాయనా! చాలు. ఇక్కడికి రక్కసిమూఁకతోడనే చచ్చు చున్నాను పైపెచ్చు కోఁతిమూఁకగూడ నెందులకు? నిద్దురలో వానరదర్శనముకంటె మృత్యుదర్శనము మేలన్నారు. మీపున్నె మున నాకింకను ఆయోగముపట్టలేదు.

కుశు—పోనీ సీతా రామలక్ష్మణులు కనిపించుచున్నారా?

గాల—లేదు, అబద్ధమెందులకు. పాపము వారెవ్వరు నాజోలికి రాలేదు.

లవు—అనఁగా వారిని నీవు చూడనేలేదన్నమాట

గాల—చూచుటకు వారు నాకడకు వచ్చినారా?

కుశు—పోనీ నీవైన వారి సన్నిధానమునకుఁ బోలేదా?

గాల—పోవుటకు దగ్గఱా దాఁపా?

కుశు—గాలవా! అడుగునకు దూరముగాని యంతఃకరణమున కేమి?

గాల—అదేమో నాయంతఃకరణ మంతవఱకుఁబోలేదుసుమా.

లవు—ఇదేమిగాలవా! లంకవఱకుఁబోయి రాక్షసులనందఱిని జూడఁ గల్గిననీయంతఃకరణము రామునిఁజూడకపోవుటయేమి?

గాల—రాముఁడయోధ్యలోఁగదా యుండునది?

లవు—ఇప్పుడు మనము చదువుచున్నది యుద్ధకాండముకాదా?

గాల—అవునుసుమా ఇప్పుడులంకలోనేయుండును కాని, చూడలేదు.

లవు—ఎందుచేత?

గాల—మీప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములీయలేక చచ్చుచున్నాను. ఇంతమాత్ర మూహింపలేకున్నావు! నీ తెలివి యింతలోఁ దెల్ల వాఱినది. రాక్షసుల వికృతాకారములు రామునకున్నవా?

కుశు—ఓహెూ ! వికృతాకారుల రాక్షసులఁగాని యన్యులంజూడనని
దీక్ష పట్టితివా యేమి ?

గాల—ఎందులకువచ్చిన దీక్షయది ; పుణ్యమా పురుషార్థమా? నేను
వారినిఁజూడ లేదు. వారేనన్నుఁ జూచుచున్నారు; వెక్కిఱించు
చున్నారు, వెఱపించుచున్నారు, నవ్వుచున్నారు, ప్రేలుచున్నారు
సోలుచున్నారు, వారిశ్రాద్ధాలేమో పెట్టుకొనుచున్నారు.

లవు—అదియా ? గాలవా ! నీపిఱికితనము నీకు నక్కఱకువచ్చినది ?
యుద్ధవర్ణనము యథాక్రమముగానీకుఁబ్రత్యక్షముచేసినది.

గాల—మీకుమాత్రము ప్రత్యక్షముకాలేదా ?

కుశు—కాకేమి ?

గాల—ఆలగైన నాతోబాటు మీరుగూడ నేలపిఱికివారుకాకుందురు?

కుశు—మేము నీవలె భయపడుచుండలేదు. యుద్ధకాండపఠనముచే
మాకెంతరణోత్సాహము కలుగుచున్నదో నీవెఱుంగవు,

మ॥ శరసంధానవిధానమందితఁడు సా ♦ క్షాద్రాముఁడేయంచు వా
నరయోధాగ్రిమ లుగ్గడింపఁ, బ్రిశయాం ♦ తకూ్రిరసంరంభ దు
ర్భరకాలానల రుద్రుభంగి, విశిఖ జ్వాలావళిఁ బం క్తికం
ధరుసేనాటవిఁ గాల్ప నాభుజము లు ♦ త్సాహంబునం బొంగెడిన్॥

లవు—గాలవా ! ఇఁక నాయుత్సాహమునకు మేరయేలేదు.

శా॥ పంకేజప్రిభవాండమెల్ల విదళిం ♦ పంజాలు దీవ్యద్ధను
ష్టాంకారం బెలయించుచున్ బటునిశా ♦ టశ్రేణిపైఁబేర్చి త
త్కంకాళంబులు రక్తవాహినులవెం ♦ టన్ బాఱ, నారాంనిధిన్
లంకాద్వీపము ముంతునా యను సము ♦ ల్లాసంబునన్ బొంగెదన్॥

గాల—అయిపోయినపెండ్లికి మేళమెందుకు ? శాంతింపుఁడు.

లవు—ఏమైనది యుద్ధకాండ మింకను బూర్తికాలేదుగా ?

గాల—అవునుసుమా ! అసలు గడుసుముండకొడుకు, కొఱుకరాని
కొయ్య, పదితలల శిఖండి యింకను నక్షే యున్నాఁడుగదా

సరేకాని, ఈబ్రహ్మ కింతమతిలేకపోవుట యేమా యని యోజించుచున్నాను. అందఱికి నొక్కతల రెండుచేతులు మాత్రము సృష్టించి యీరక్కసచచ్చినవానికిఁ బదితలలు నిరువదిచేతులును సృష్టించినాఁడెందులకో?

కుశు—ఇది రాక్షససృష్టికదా!

గాల—ఆమాటనేనొప్పుకోను. రాక్షసు లందఱికి నిట్లుండిన లోకము లన్నియు నీవలెనే నిర్మూలములు కాకపోయినవా? పాములలో రెండుమూఁడుతలలశిఖండులఁ బుట్టించినట్లు రక్కసులలో నీపది తలలశిఖండిని బుట్టించినాఁడు. పరకాంతాపహరణపాపకర్మమునకు వీనికి రెండుచేతులు చాలవని యిరువదిచేతులును, బరమసాధువులైన దేవమానవతపోధనుల రక్తమాంసములఁబీల్చుటకు నొక్కనోరుచాలదని కలవుదీఱునట్లు పదినోళ్ళను వీనికి సృష్టించినాఁడు ఈ మొండికట్టె కొకనాఁడైన దగ్గుపడిసెము పట్టలేదుకాఁబోలు. పట్టినచోఁబదిముక్కులొక్కమాఱు టంగునబిగిసి, యూపిరియాడక యెన్నఁడో చచ్చియుండును. ఓరీ! నీరూపము కాల! మిత్రుఁడా! బ్రహ్మసృష్టిలో నెన్నెన్ని చిత్రము లున్నవోయి!

కుశ—గాలవా! కవిబ్రహ్మసృష్టిలో నింతకుమించిన విచిత్రములులేవా?

కుశ—గీ॥ బ్రహ్మసృష్టి ప్రపంచచి ♦ త్రములు చిరము
నిలుచునవి కావు, కాల మ ♦ న్నిఁటి హరించు;
ఇంతవఱ కెన్నిగలిగెనో, ♦ యెన్నిమనెనో,
యెన్నినశియించిపోయెనో ♦ యెవని కెఱుక

లవు—గీ॥ కవికి నొక్కనికే వీని ♦ గాధ యెఱుక
ప్రళయమందినసర్వప్ర ♦ పంచములను
భావసంజీవిచే నిట్టె ♦ బ్రతుకఁజేసి
యక్షరాకారములతోడ ♦ నతఁడు నడుపు॥

కుశ—సీ॥ కవి విలోకింపలేని లో ♦ కంబు లేదు
దూర మిది, దా పిది, యంటన్న ♦ మేర లేదు
సుగమ మిది, దుర్గమ మిదన్న ♦ చోటు లేదు
భువనచయమెల్ల వతనిచూ ♦ పుననె మెలఁగు.

లవు—గీ॥ భూతపూర్వంబుల, నభూత ♦ పూర్వములుగ
నలిపి, యెప్పటికప్పు డా ♦ క్షణమునందు
జరుగుచున్నవిగానె వి ♦ శ్వముల నెల్లఁ
గలము పోఁటున నాడింపఁ ♦ గలఁడు సుకవి

కుశ—గీ॥ లోకములు కావ్యరంగంబు ♦ లోని తెరలు
వానిలోఁ జన్న వారున్న ♦ వారు గలిసి
యాడుదురు, పాడుదురు, తగ ♦ వాడుకొందు,
రిట్టి నవ్వేదు, రేడ్తు రే ♦ మేమొ గతుల.

లవు—మిత్రులారా! ఇట్టివికదా. కవిబ్రహ్మసృష్టిలోని విచిత్రములు వాగ్బ్రహ్మమునఁ బ్రబుద్ధులైన వాల్మీకిభగవానుల రామాయణేతిహాసప్రపంచమున మన మిప్పుడు సంచరించుచున్నాము. ఆయా పాత్రల యవస్థాభేదముల ననుభవించుచున్నాము. ఆమహానుభావుని యనుగ్రహముచేఁగదా రామాయణవిషయములన్నియు మనకుఁబ్రత్యక్షానుభవములోనికి వచ్చుచున్నవి.

గాల—సరేకాని, మనయాశ్రమమునకెవరో పెద్ద పెద్ద గడ్డాలవారు చాలమంది వచ్చినారు వారెవరో విచారింతము రండు!

లవు—నేనువటులతోఁ గుశపత్రాదికములఁ దేఁబోయెదను మీరుభరతాశ్రమమునకుఁ బోవలయునని గురులాదేశించిరికదా పొండు

కుశ—అవును (కుశుఁడు గాలవుఁడునిష్క్రమింతురు)

ఇదివిష్కంభము

(జనకుఁడు, కంచుకి, యరుంధతి, కౌసల్య ప్రవేశించుచున్నారు)

జన—ఓహో! నేఁడు శిష్టానధ్యయనము కాఁబోలు. అందువలనవటువు లందఱు యథేచ్ఛగా నాడుకొనుచున్నారు.

కౌస—బాల్యమేకదా సౌఖ్యమున కాస్పదము. (నిరూపించి) అహో! వీరినడుమనున్న ఆబాలుఁ డెవ్వఁడో? ఈదారముగ్ధలలితములైన యవయవములతో మారామభద్రుని పసితనంపు లీలలఁ దలపించుచు నాకన్నులఁ జల్లఁజేయుచున్నాఁడు.

అరుం—(తనలో) ఇది యేకదా వాల్మీకిచెప్పినరహస్యకర్ణామృతము కాని ఆయుష్మంతులగు కుశలవులలో నీతఁడెవ్వఁడో?

జన—అహో! ఎవ్వఁడీబాలకుఁడు!

సీ|| కలువరేకులకాంతిఁ • జిలుకు నున్నదనంపు మెఱుఁగుఁజామనచాయ • మేనివాఁడు
అలినీలపునిగన్ని • గల పిల్లసిగతోడ ముద్దారు చిన్నారి • మోమువాఁడు
చలువవెన్నెలల జా • బిలివోలె వఱలు లోఁబున్నెంపుసిరి నించు • చున్నవాఁడు
చిఱుతప్రాయంబందె • మఱల మా రఘురాముఁ దని నిరూపింప వీ • లైనవాఁడు
గీ|| బాలకుండీతఁ డెవ్వరి • వాఁడో కాని కూర్మిసుత సీతమోము గ • న్గొను నదృష్ట
ముకసు నాచిన నానేత్ర • ములకు గూడ హాయిమన నించెనిట్టి సు • ధాంజనంబు

కంచు—ఈబాలకుఁడు క్షత్రియ బ్రహ్మచారియని సౌనమ్మకము.

జన—సందేహ మెందులకు?

సీ|| వీఁపునం దిరువంక • వెలయుఁ బ్రోమ్మడి దాఁకు కంకపత్రకదంబ • కము అదోనలు
ఉరమునం దొప్పారు • రురుచర్మచేలంబు భసితపుంజపరాగ • పావనంబు
కటిసీమఁ జెన్నారుఁ • గావిమాంజిష్ఠంబు లలితమౌర్వీమేఖ • లాయుతంబు
కరసరోరుహమందు • మెఱుఁగారుఁ గార్ముక ప్లక్షదండము, లక్ష • వలయికంబు
గీ|| అర్హచిహ్నంబు లివియెల్ల • నట్టులుండ । ధీర లలితప్రసన్నగం • భీరమైన
అల్లమూపాకృతే చాల • గా యితండు । క్షత్రియబ్రహ్మచారి ని • క్కమ్మని తెలుప||

ఆర్యా గృష్టీ! నాకుఁ గడు వేడుక యగుచున్నది. నీవుపోయి వాల్మీకిభగవానుల నడిగిరమ్ము. చూడు, ఆబాలకునితో ఈవృద్ధు లెవ్వరో నిన్నుఁ జూడఁగోరుచున్నారనియుఁ జెప్పుము.

కంచు—చిత్తము. అలాగే చేసెదను. (నిష్క్రమించును.)

కౌస—ఇట్లు చెప్పిన వచ్చునా?

అరుం—ఇటువంటి యాకారవిశేషమునకు మంచినడవడి లేకుండునా?

కౌస—ఆహా! గృష్టివాక్యములు కడునడంకువతో నాలించి, వెంటనే తోడిబాలురనెల్ల విడిచి యాతఁ డిటు మొగంబై రానేవచ్చుచున్నాఁడు.

లవు—(ప్రవేశించి తనలో) వీరందఱు పూజ్యులే, అయినను వీరినామక్రమగోత్రంబు లెఱుంగకయే యెట్లు నమస్కరింతును? (ఆలోచించి) కానీ, ఈపద్ధతియు విరుద్ధముకాదని పెద్దలవలన విన్నాఁడను. (వినయముతో సమీపించి) ఈలవుఁడు మీకందఱకు సాష్టాంగప్రణామ మాచరించుచున్నాఁడు.

ఆరుంధతి— } కల్యాణిన్ ఆయుష్మాన్ భూయాః!
జనక— }

కౌస—బిడ్డా! చిరకాలము వర్థిల్లుము!

అరుం—ఇటురానాయనా! (అని లవునితొడపైఁగూర్చుండఁ బెట్టుకొని తనలో) ఆహా! ఒడిమాత్రమే కాదు; చిరకాలమునకు నామనోరథముగూడ నిండినది.

కౌస—బిడ్డా! ఇటుగూడఁ గొంచెము రమ్ము. (ఒడిలోఁ జేర్చికొని) అహో! నవనీలోత్పలమువలె శ్యామలోజ్జ్వలమైన దేహబంధముచేతనేకాక కమలకేసరగ్రాసముచేఁ మధురకంఠమగు రాయంచయెలుంగువలె ఖంగని మ్రోయు గంభీరస్వరముచేతఁగూడ వీఁడు రామభద్రునినోటిలోనుండి యూడిపడినట్లున్నాఁడు. తామరకోశమువలెఁ బరిపేశలమైన తనుస్పర్శముగూడ నట్లేయున్నది. నాయనా! ఏది నీముఖచంద్రు నొక్కమాఱుచూడనిమ్ము (అని చుబుకము నెత్తిచూచి కన్నీటితో సాభిప్రాయముగా, రాజర్షీ! కనిపెట్టితివా? చక్కఁగఁ

బరికించినచో వీని ముద్దుమోమునందు విస్పష్టముగఁ గోడలి మోము చందురుని జాడలు జూపట్టుటలేదా ?

జన—చూచుచున్నాను సఖీ! చూచుచున్నాను.

కౌస—అయ్యో ! పిచ్చియెత్తినదానివలె నామన స్సేమేమో తలపోఁత లతోఁ బలుపోకలఁబోవుచున్నదే.

జన—ఆహా ! ఇంకను సందేహమెందులకు ?

మ॥ ప్రతిభావంబు సమగ్రముట్టిపడుతే ♦ వఁ జానకీరాఘవుల్
ప్రతిబింబించిరొ వీనిలోపల; సురూ ♦ పశ్రీలవే, వాకదే,
గతితేజోవినయంబులా యనె, నిస ♦ ర్గప్రాభవంబే నచే
మతి యేమో యడియాసలఁ బయిపయిం♦బర్వెత్తు హాదైవమా !

కౌస—అబ్బాయీ ! నీకుఁ దల్లి యున్నదా ? నీతండ్రిం దలంచుకొను చుండునా ?

లవు—లేదు.

కౌస—అట్లయిన నీ వెవ్వరివాఁడవు ?

లవు—వాల్మీకిభగవానునివాఁడను.

కౌ—ఓయీ ! అడిగినది విస్పష్టముగఁ జెప్పుము.

లవు—నాకింతవఱకే యెఱుక.

(తెరలోపల) ఓహోహో సైనికులారా ! ఇదిగో కుమారచంద్రకేతుఁ డాజ్ఞాపించుచున్నాఁడు " ఏవ్వఁడును ఆశ్రమోపాంత ప్రదేశముల నాక్రమింపఁగూడదు " అని.

అరుం—ఓహోహో ! యాగాశ్వరక్షాప్రసక్తిచే నిచ్చటికివచ్చుకుమారుఁ జంద్రకేతునిగూడఁ జూడఁగలము. ఆహా ఇదే సుదినము.

కౌస—ఆహా!వత్సలక్ష్మణుని పుత్రకుఁ డాజ్ఞాపించుచున్నాఁడను నమృత బిందుసుందరములగు నక్షరములు వినఁబడుచున్నవి.

లవు—ఆర్యా! ఈచంద్రకేతుఁడెవరు ?

జన—దశరథకుమారుల రామలక్ష్మణుల నెఱుంగుదువా ?

లవు—ఎఱుంగ కేమి? రామాయణ కథాపురుషులు వారేకదా!

జన—అవును. ఆలాగైన నిది యేలయెఱుంగవు! ఆలక్ష్మణునికుమారు (డే యీచంద్రకేతువు.

లవు—అట్లయిన నూర్మిలా దేవికిఁ బుత్త్రుఁడు...రాజర్షియగు మిథిలా నాథునికి దౌహిత్రుఁడు.

అరుం—(నవ్వుచు) కుమారుఁడు కథాప్రావీణ్యమును బ్రకటించినాఁడు.

జన—బాలకా! ఆకథయందు నీకింతటి ప్రావీణ్య మున్నదికదా ! ది ఆ దశరథకుమారుల కేయేభార్యలయం దేయే పేరుల యపత్యములు పుట్టిరో చెప్పుము చూతము.

లవు—ఈకథాభాగము మేముగానియన్యులుగానియెన్నఁడువిన్నదికాదు.

జన—అదియేమి! కవి రచింపనేలేదా ?

లవు—రచించినారు. కాని ప్రకటింపలేదు. దానిలోని యొకకథా భాగమును రసవత్తరమగు నాటకముగాఁ గూడ రచించిరి. ఆ గ్రంథమును స్వహస్తముతో లిఖించి తౌర్యత్రికసూత్రధారియగు భరతాచార్యులకుఁబంపినారు.

జన—ఎందులకు?

లవు—ఆమహానుభావు, డప్సరస్త్రీలచే దాని నాడించునని,

జన—ఇదియంతయు నేదో గూఢార్థముగనున్నది.

లవు— ఆగ్రంథముపై వాల్మీకిభగవానుల కెంతయో యభిమానము. అందుకొఱకే యంతేవాసులచే దానిని భరతాశ్రమమునకుఁ బంపు నపుడు త్రోవలో నేప్రమాదముగలుగకుండఁధనుర్ధరుని నాసహో దరునిగూడఁ బాసటగాఁ బంపియుండిరి.

కౌస—నీకు సహోదరుఁడుగూడఁ గలఁడా ?

లవు—ఆఁ కలఁడు. కుశుఁ డని ఆర్యుని పేరు.

కౌస—అనఁగా నీకు జ్యేష్ఠుఁడన్నమాట.

లవు—అవును, ప్రసవానుక్రమంబున నాతఁడే పెద్దవాఁడు

జన—ఎట్లూ ! ఆయుష్మంతులు మీరు కవలపిల్లలా యేమి?

లవు—అవును.

జన—బాలకా! చెప్పవు ప్రకటితమగు కథాప్రపంచ మెంతవఱకు వచ్చినది ?

లవు—పౌరజానపదుల మిథ్యాప్రవాదమునకు వెఱచినరాజుచే వెడలఁగొట్టఁబడిన ఆసన్నప్రసవవేదనయగు సీతామహాదేవిని లక్ష్మణుఁడేకాకినిగాఁ గీకారణ్యమున విడిచి,

కౌస—ఆయ్యో బిడ్డా! ఏకాకినివై యల్లాడు నీశరీరపుష్పమున కేదైవ దుర్విపాకము సంభవించెనోకదా!

జన— హావత్సా ! సీతా! ఎమైపోయితివి

మ॥ అనిమిత్తంబగునిందచే నడవిపా ♦ లై సాయముంజేయ నా
యనువా రెవ్వరులేక, కాన్పుసమయం♦బై, నొప్పులం దూలుచో
మనువెన్క నహానోగ్రజంతునివహం♦బుల్ మూఁగికాటాడ నో
జనకా! నాగతిఁజూడవే యనుచు వ ♦ త్సా !యెంతవాపోయితో॥

లవు—(అరుంధతింగూర్చి) అమ్మా! వీరెవరు?

అరుం—ఈమె కౌసల్య; ఈయన జనకుఁడు.

లవు—(బహుమానఖేదకౌతుకములతోఁ జూచును)

జన—ఔరా! దురాత్ములగు నీపౌరుల నేమనవలయు? ఈరామరాజు వేగిరపాటున కేమనవలయు!

మ॥ పరిభావంబిది ఘోరవజ్రహతియై ♦ బాధింపఁ గ్రోధాగ్నికిన్
దరుణంబైనది చాపశాపముల చే♦తన్ భగ్గునన్ మండఁగా......

కౌస—భగవతీ! రక్షింపుము. రక్షింపుము. కుపితుండైనయీరాజర్షిని బ్రసన్నుంజేయుము.

అరుం—రాజర్షీ! అవును పరాభూతులైన మానవంతుల కింతకంటె బ్రాయశ్చిత్తములేదు, కాని

అరయన్ రాముఁడు నీకుఁ బుత్త్రవిషయంబై బా పౌరసంతాన మా
దరణీయద్విజబాలవృద్ధ వికలస్త్రైణంబికన్ సైఁపనా॥

వటువులు-(సంభ్రమమునఁ బ్రవేశించి) కుమారా! "అశ్వము అశ్వము" అని యొకానొక భూతవిశేషము జనపదములయందుండునని వింటి మే దాని మేమిప్పుడు ప్రత్యక్షముగాఁజూచినాము.

లవు—అశ్వమని, పశుశాస్త్రమందే కాక సాంగ్రామికశాస్త్రమునగూడఁ జదివితిమి. ఇఁక దానిస్వరూపమెట్లున్నదో చెప్పుఁడు

౧ వటువు_చెప్పనా? దానికి వెనుకభాగమున నొక జల్లితోఁకయున్నది

౨ ,, కుమారా అది దానినెల్లప్పుడాడించుచుండును.

౩ ,, మెడ చాల నిడుపుగానున్నది.

౪ ,, మనయాశ్రమ కురంగములకెట్లో దానికిని గిట్టలు నాలుగే.

౧ ,, అదియు గరికెపరకలే మేయును.

౨ ,, కాని యది మామిడికాయలంతపాటిశకృత్పిండకముల వేయును

౩ ,, కుమారా! ఈవ్యాఖ్యానములతో నదియీపాటికిఁ జాలదూరము పోయియుండును రమ్ము రమ్ము పోదము (అని భర్మోత్తరీయముంబట్టిలాగుచున్నారు.)

లవు—(కౌతుకోపరోధవినయములతో) పూజ్యులారా, చూడుఁడు చూడుఁడు, వీరునన్నులాగికొనిపోవుచున్నారు.(అని నడిగఁబరిక్రమించును.)

కౌస—భగవతీ! వీనింజూడకున్న నేబ్రతుకునట్లులేదు. ఆవైపునకేగి పరువెత్తుచున్న కుఱ్ఱవానిం జూతము రండు.

అరుం—ఎట్లు చూడఁగలము అప్పుడే వాఁడు వేడుకమై కడుదూరము పరువెత్తినాఁడు.

గృష్టి—(ప్రవేశించి) వాల్మీకిభగవానులు సెలవిచ్చినారు "ఈవిషయము తగు సమయమున మీకే తెలియఁగలదు" అని.

జన—ఇది ఏదియో యతిగంభీరముగనున్నది. భగవతీ, అరుంధతీ! సఖీ కౌసల్యా! రండు మనమే స్వయముగ వాల్మీకిం దర్శింతము.

(వృద్ధజనము నిష్క్రమించును.)

వటు—కుమారా! ఆ చిత్రముం జూడుము.

లవు—చూచితిని గ్రహించితిని నిజముగా నిది యశ్వమేధహయము.

వటు—ఎట్లు గ్రహించితివి?

లవు—ఓయీ మూర్ఖులారా! ఆకాండము మీరును పఠించినదేకదా. ప్రత్యేకము నూఱ్ఱురు కవచధరులు, దండధరులు తూణీరధరులు నగు రక్షకులున్నారే ఏరికిందగిన బలముగూడ వెనుక ముందు నడుచుచున్నదే కనబడుటలేదా? నామాటనమ్మకున్న పోయి వారిచే అడుగుడు.

వటు—ఓహో ఎవరయ్యా; ఈగుఱ్ఱమును దండుతో నూరేగించుచున్నారెందులకు?

లవు—(ఆసతోడ్‌దనలో)అవునుసుమా! అశ్వమేధమనఁగా జగజ్జేతలగు క్షత్రియుల సోత్కర్షను బ్రకటించునదికదా, ఇతర క్షత్రియుల నందఱిఁ బరాభవించునదికదా, ప్రతాపమును బరీక్షించు నొరపిడి రాయికదా యిది.

(నేపథ్యమున)

గీ॥ అశ్వమియ్యది సప్తలో ♦ కైకవీర
సార్వభౌముని రాముని ♦ జయపతాక
దశముఖునిశాటకులనిషూ ♦ దను గభీర
వీరఘోషణ మియ్యది ♦ విశ్వమునకు

లవు—(వ్యథతో)అహో! ఆత్మను రగలించుచున్నవిగదా యీయక్షరములు.

వటు—ఔరా! ఏమనుచున్నారు, కానీ, కుమారా! నీకుఁదెలియనిదేమున్నది.

లవు—ఓహో! మీరింతగఁజాటించుచున్నారే పృథివిలో మఱిక్షత్రియులే లేరాయేమి ?

(నేపథ్యమున) అరే! మహారాజుముందు మఱి క్షత్రియు లెవరురా?

లవు— ఛీ జాల్ములారా !

గీ॥ఉందురో లేరొ యట్టివా♦రుండనిండు ఈపటాటోపమంతయు♦నేలమీకు
వెఱతురేవీరులింతనే♦వేయునేల కాచికొనుఁడిదెమీపతా♦కనుహరింతు.

ఓహోవటువులారా! అడ్డముగఁబోయి మట్టిబెడ్డలతోఁగొట్టి ఈగుఱ్ఱమును మఱలింపుఁడు ఇది మనరోహితమృగములలో దిక్కుమాలి సంచరించుచుండుఁగాక

పురుషుఁడు (క్రోధదర్పములతోఁ బ్రవేశించు) ఛీ, ఏమిరాయీయల్లరి ఆఁ! ఏమన్నావు, చూడుమటు మహోగ్రులగు నాయుధీయులసంఖ్యాకులున్నారు వీరికి దాక్షిణ్యమనునది లేదు పిల్లవాఁడన్నను గర్వాలాపములెంతమాత్రము సైరింపరు. అరివిమర్దనుఁడగు మా రాజపుత్త్రుఁ డీ ప్రాచ్యారణ్యముం జూడఁబోయినాఁడు. ఆతఁడు తిరిగిరాకమున్నే యీ చెట్లచాటునంబడి పాఱిపొండు.

వటు—కుమారా!ఆలాగైన ఈగుఱ్ఱముజోలిమనకేల?భటసముదాయములేమో విచ్చు కత్తులంజళిపించుచు,నిన్ను బెదరించుచున్నారు. ఆశ్రమమేమో యిక్కడికిఁ జాలదూరమున్నది. రమ్ము లేడిగంతులతోఁ బాఱిపోదము.

లవు—(నవ్వుచు) ఏమీ విచ్చుకత్తులజడిపింతురుగా కానీ చూతము. (ధనురారోపణముచేయుచునిష్క్రమించును) అందఱుబరువెత్తెదరు.

ఇ ది ప ం చ మా ం క ము.

---



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తరరాఘవము.

## షష్ఠాంకము

(నేపథ్యమున)

ఓహో! సైనికులారా! మనకాధారమిదిగో దొరకినది. చూడుఁడు

చ॥ సమరమునాలకించి, కను సైఁగ సుమంత్రుఁడు వేగవత్తురం
గముల నదల్ప, మేటివలి కాటవు బాటలదాటుచో, శతాం
గముపయి కోవిదార తరు కాండపతాకము సంచలింప, రా
కొమరుఁడు చంద్రకేతుఁడిదిగో, చనుదెంచె, భయంబులేదికన్॥

(పిమ్మట సుమంత్రుఁడు తోలుచున్న రథముపై, చంద్రకేతుఁడు ధనుష్పాణియై ప్రవేశించుచున్నాఁడు)

చంద్ర—ఆర్యా! సుమంత్రా! పరికింపుము,

శా॥ కించిత్కోపముతో ముఖాంబుజరుచుల్ కెంపారఁ, గర్ణాంచల
ప్రాంచచ్చాపశిఖా నిరంతర రట జ్జ్యాఘోషతో, సర్వత
స్సంచారంబున, సేనపై, శితశరాసారంబు వర్షించుచున్
పంచాస్యంబసమించు పంచశిఖుఁ డీ బాలుండెవండో కదా?

అహో! ఈవీరకిశోరమెవ్వరికిం దెలియరాకుండనుండిన మా రఘువంశీయ నూతనాంకూరమా అనునట్లు పసివాఁడయ్యు నసహాయ శూరుఁడై, యింతటిసేనాసముద్రమధ్యమున నేవంకజూచినను, దానయై, గంధసింధుర కపోలగ్రంథిటాంకారఘోరముగ శరవర్షముం గురి

యుచున్నాఁడు. ఆహా! ఈతని వీరవిహారము మహాద్భుతముగనున్నది. ఆర్యా, చూచుచుంటివా ?

సుమం——ఆయుష్మంతుఁడా ! ఇంకఁజెప్పెడిదేమి?

గీ॥ ఎఱుఁగము సురాసురుల కేని ♦ యీప్రభావ
మీమహోక్షీ తఁడే నీకు, ♦ నితనిగాంచి
కౌశికాధ్వర వైరి శి ♦ క్షణముకొఱకు
ధనువుదాల్చిన రఘునంద ♦ నుని స్మరింతు॥

చంద్ర——ఆర్యా! చూడు, ఏకాకియగు వీనిసైయనేకులింతగాఁ బెనంగుచుండుటఁ జూడ నాకు సిగ్గుగానున్నదిసుమా.

సుమం——కుమారా ! వీరందఱేకమై డీకొన్నప్పుడే యిట్లున్నది. ఇంక నొక్కరొక్కరుగానైనఁ జెప్పవలసినదేమి?

చంద్ర——ఆర్యా ! త్వరపడుము త్వరపడుము. ఈతఁడు మనపరిజనంబుల నూరక నుఱుమాడుచున్నాఁడు,

శా॥ భేరీభాంకృతఘూర్ణమాన నిజవా ♦ క్ష్వేటాంకృతిన్ జేసి, కాం
తారేభంబులు, కర్ణముల్ వగిలిబా ♦ ధన్, ఘీంకృతుల్ సేయ, నో
టారన్ భైరవుఁ డారగించి, విడు మృ ♦ ష్టాహార శేషంబనన్
బోరన్ డొల్లెడు మొండెముల్ తలలప్రో ♦ వుల్ నించె వీఁడుద్ధతిన్ ॥

సుమ——(స్వగతము)అక్కటా ! ఇట్టివానితోడి ద్వంద్వయుద్ధమునకుఁ గుఱ్ఱవానిఁ జంద్రకేతు నెట్లంపుదును. (ఆలోచించి)కాదని యూరకున్న నెట్లు! ఇక్ష్వాకు వంశ వృద్ధులముకదా మేము. సంగ్రామము సంఘటిల్లినప్పుడు మఱి గత్యంతరమేమి?

చంద్ర——(ఆశ్చర్య లజ్జాసంభ్రమములతో)ఇస్సీ !నాసైన్యములు చెల్లాచెదరై నలువంకలఁబడి పాఱిపోవుచున్నవే!

సుమం——(రథముగడిపి)ఆయుష్మంతుఁడా, అతఁడే యీవీరుఁడు, మాట వినికిదూరమునన్నాఁడు,

చంద్ర——ఆర్యా ! ఈతనిపేరేమన్నారు?

సుమం__"లవుడు" అనికదా.

చంద్ర—ఔను మఱచితి, (లవునివైపునకుందిరిగి)

గీ॥ అవుర! యోలవ, వీరాగ్ర ♦ ణివి గదోయి
ఈభటసమూహమన్న నీ ♦ కెంతపాటి
ఇదిగో, వచ్చితి నెదిరింపు ♦ మింకసన్ను
తేజము శమించుగావుత ♦ తేజమందె॥

సుమం—కుమారా! హెచ్చరిక, ఆబాలవీరుఁడు నీపిలుపాలకించినవెంటనే యుఱుమువినియేనుంగులవేఁటచాలించి బరవసమున నెదిరించు పొగరుసింగపుఁబిల్లవలె మనవైపునకు వచ్చుచున్నాఁడు.

(పిమ్మట సత్వరాటోపమున లవుఁడు ప్రవేశించును.)

లవు—బలే! రాజపుత్త్రా! బలే నిక్కముగ నీవైక్ష్వాకుఁడవే. ఇదిగో వచ్చితి మాటచెల్లింపుము. (నేపథ్యమున సేనాకలకలమువిని) ఛీ, వెన్నిచ్చి విచ్చలవిడిగాఁ బాఱిపోయిన యీసేనానాయకులు మఱల రణరంగమునఁ గూడికొని నన్నుజుట్టుముట్టుచున్నారు. తొలుత వీరి సంరంభమణఁగింతుఁగాక (సేనకై తిరిగి)అరే మూర్ఖులారా!

చం॥ నలుగడలంగడంగుచు ఘ ♦ నంబుగ సంకులమైన మీచమూ
కలకలమెల్ల నొక్కవడి ♦ గావుత మాహుతి నారుషాగ్నికిన్
ప్రళయరయప్రభంజన వి ♦ భగ్నమహార్ణవవాః ప్రపూర ము
జ్వలదచలాహతిక్షుభిత ♦ బాడవవహ్నిశిఖాళికిన్ బలెన్

(అని పరిక్రమించును)

చంద్ర—ఓహో, కుమారా!

చ॥ భువనమనోహరంబగు న ♦ పూర్వగుణాతిశయంబునన్ బ్రియుం
డవుగద నీవు నెయ్యుఁడవు ♦ నాకటుగావున నావియెల్లనీ
యవియె రణంబిఁకేల స్వజ ♦ నావళితో నిటురమ్ము చంద్రకే
తువు నికషంబిదే యొరసి ♦ దోర్బలమెట్టిదో చూచుకొమ్మికన్

లవు—(హర్ష సంభ్రమములతో మఱలి)అహో, ప్రసన్న కర్కశంబగు నీతని వీరవచన ప్రయోగమెంత గంభీరముగానున్నది. మహానుభావుఁడుగదా యీసూర్యవంశకుమారుఁడు ఇఁక నీచిల్లర సైనికులతోనేమి! ఈతనినే గౌరవించెదఁ గాక(మఱలఁ దెరలోఁ గలకలము) ఛీ ఛీ! ఈపాపాత్ములు వీరసంవాదమునకు విఘ్నమాచరించుచున్నారు కానీ! వీరికోలాహలమంతయు నింతలో నణంగింతు (సేనపైకి మఱలుచున్నాఁడు)

చంద్ర—ఆర్యా! సుమంత్రా! ఈవీరకిశోరుని విజృంభణముచూడు,

సుమం—కుమారుఁడే వీనిందేఱిచూచుటకైన సమర్థుఁడు. మేమో, కేవలము విభ్రాంతిలో మునింగియున్నాము.

చంద్ర— ఓహో రాజన్యులారా! చాలుఁజాలు మీప్రతాపములు.

మ॥ కవచాధారులు, వాజికుంజరశతాం ♦ గస్వైరసంచారులఁ
గ్రివయస్సారులు, మీర, నేకులిటు లే ♦ కంబోచు డీకొంటిర
న్నవలేమేని పదాతి నొక్కగసుగం♦ దుర్గ మేధ్యచర్మోత్తరీ
యు, విచారింపుఁడు మీకు మాకు నిదియొ♦గ్గోవన్నె యోవాసియో

లవు—(వ్యథతో) ఏమీ జాలిపడుచున్నాఁడుగా! (ఆలోచించి) కానీ, వృథా కాలక్షేపము గాకుండునట్లు జృంభకాస్త్రప్రయోగముతో నీ చమూసమూహముల మూర్ఛిల్లఁజేసెదఁగాక. (ధ్యానము నభినయించును.)

సుమం—అహో! ఏమది, ఆకస్మికముగా సేనాకలకలంబాగిపోయినది

లవు—ఈతని దర్పమేమో యుప్పొంగుచూచెదను.

సుమం—వత్సా! ఈకుఱ్ఱవాఁడు జృంభకాస్త్రముప్రయోగించినట్లున్నది.

చంద్ర—అందులకు సందేహమేమి! లోకబంధ కారబంధురమై, మెఱపుతీఁగల తళత్తళలచేఁ గన్నులు మిఱుమిట్లాడుచున్నవి. సైన్యమంతయుఁ జిత్తరువువోలె నిశ్చేష్టితమైపోయినది. నిక్కముగ, నమోఘతేజమగు జృంభకాస్త్రము విజృంభించుచున్నది.

సుమం—అహో! ఈజృంభకాస్త్రము లీతని కెట్లు సంప్రాప్తించినవో,

చంద్ర—వాల్మీకి భగవానుఁడే యనుగ్రహించియుండును.

సుమం—కుమారా! ఆయన కస్త్రశిక్షావ్యవహారము లేదు. అందులో నీజృంభకములయందసలే లేదు. ఇవి భృశాశ్వుని యపత్యములు. అతనినుండి విశ్వామిత్రునకును అందుండి మా రామభద్రునకును సంక్రమించి స్థిరములై యున్నవి. కాని, కుమారా! ప్రవీరుఁడు సమీపించుచున్నాఁడు హెచ్చరికసుమా,

లవు—చంద్ర—(ఒండొరులం గూర్చి) అహో ప్రియదర్శనుఁడీ కుమారుఁడు!

మ॥ కనుఁగొన్నంతనె వీనియందు, మది ల ♦ గ్నంబయ్యె, నద్వైతభా
వన! యాదృచ్ఛికమో, గుణాతిశయసౌ ♦ భాగ్యంబొ, జన్మాంతరం
బునఁ జేకూరి, నిరూఢమై తగుచిరం ♦ పుణ్ మైత్రియో, యొక్కఁడొ
క్కనిసంబంధము దైవతంత్రిత నెఱుం ♦ గఁగ రాని బాంధవ్యమో!

సుమం—ఒకొక్కరియందొకొక్కరికి రసమయంబగు ప్రీతి జనించుట ప్రాయికముగా ప్రాణిధర్మము. అనుభవజ్ఞానులు దీనినే తారామైత్రి యనియు, చక్షూరాగమనియు వ్యవహరింతురు. ఈప్రేమకుఁ దార్కాణము లేదు, కారణమంతకును వేలేదు. అయినను పెద్దలు దీనినిఁ బ్రమాణముగ నంగీకరింతురు.

గీ॥ హేతువేలేని యీపక్ష ♦ పాతమునకు
భంగమెప్పాటనైన సం ♦ భవముకాదు
స్నేహమయతంతు విద్దానిఁ ♦ జెదరనీక
హృదయమర్మంబులను గది ♦ యించి కట్టు॥

లవు—చంద్ర (ఒండొరులం గూర్చి)

గీ॥ మెఱుఁగిడిన జాతిరతనంపు ♦ టొరపులీను
వీనిమేను శరాళి కొ ♦ ప్పింతునెట్లు

అమరునేనిది కౌఁగిలిం ♦తమను కోర్కి
హృదయముప్పొంగి మై పుల్క ♦ రించుచుండె॥

అయినను, పరాక్రమ తేజస్వులగుశూరులతోఁడి వీరవిహారము నకుశస్త్రమే కాక మఱిశరణ్యమేమున్నది. అందులో ఇటువంటివీరశర వ్యము దాకని శస్త్ర మొకశస్త్రమా? అదియుంగాక శస్త్రధారియగు నీతనింగని మోమోటమున యుద్ధమేటికని నేనేతొలంగుదునేని, నీతఁడే నన్నేమనఁగలఁడు. అహెూ! కఠోరమగు వీరధర్మము స్నేహపరిపాటిని నిరోధించుఁగదా.

సుమం—(లవుని నిర్వర్ణించి కన్నీళ్ళతోఁ దనలో) హృదయమా! ఏల నీకీ యడియాస,

తే॥ అక్కట! మనోరథంబుల ♦ కాదిమూల
మేదొ దైవంబు దాని ము ♦ న్నేహరించె
త్రెంపి మును పాఱవైచిన♦తీఁ వకింక
క్రొత్తవిరిమొగ్గయేమి చే♦కూరుటేమి।

చంద్ర—ఆర్యా। సుమంత్రా।నేను రథము దిగియెదను.

సుమం—ఎందులకు?

చంద్ర—ఈ వీరపురుషుని గౌరవించినట్లగును. క్షాత్రధర్మమును నిర్వ హించినట్లగును. రథస్థులు పాదచారులతో యుద్ధముచేయరని శాస్త్రవేత్తలు వక్కాణింతురుగదా.

సుమం—(తనలో) అయ్యో, కష్టముసంభవించె నే నాకు ;ఇప్పుడు ధర్మాచారమును దప్పింతునా? కుమారుని సాహసకృత్యమునకు సమ్మతింతునా?

చంద్ర—ఆర్యా। మానాయనగారు సయితము, ధర్మసంశయములను, మీవలననే తీర్చుకొందురే మఱి యీవిషయమున నింతగానాలో చనమేమి?

సుమం——ఆయుష్మంతుఁడా! నీవు ధర్మాచార మతిక్రమింపలేదు, ఇదియే సనాతనమైన సాంగ్రామికధర్మము; మీరఘుసింహు లనూచానముగ నడుపుచుండు వీరచారిత్రపద్ధతియే యిది.

లవు——అహో ఉత్సాహము కలఁగలుపుగానున్నదే।

ఉ॥ పున్నమచందురుం గనుక ♦ ముద్వతివోలె మదీయదృష్టి యీ
యన్నువవీరునందు ముద ♦ మందెడుగాని, ఝణంక్రియాసము
ద్యన్నినదోరుదారుణ గు ♦ ణాంకితకార్ముకమైన యీభుజం
బన్ననో, విస్ఫురద్రణర ♦ సానుభవంబునకే త్వరంపడుం॥

చంద్ర——(రథము దిగి) ఆర్యా! సుమంత్రా! సావిత్రుఁడీచంద్రకేతుఁడు నమస్కరించుచున్నాఁడు.

సుమం——కుమారా। నీగురుపరంపర సంగ్రామమున నీకు శ్రేయం బాపాదించుఁగాత.

లవు——కుమారా! నీవు తేరియందే మిగుల శోభించుచున్నావు, వలదు అత్యాదరము వలదు. రథ మెక్కుము.

చంద్ర——ఆలాగైన మహాభాగా। నీవును వేఱొకరథ మలంకరింపుము.

లవు——ఆర్యా। సుమంత్రా! రాజపుత్రుని రథమెక్కింపరాదా?

సుమం——నీవును చంద్రకేతువచన మనుసరింపరాదా?

లవు——ఎవరి యుపకరణము వా రుపయోగించుకొనుటయందభ్యంతర మేమున్నది? కాని మే మడవులలోఁ బెఱిఁగినవారము, రథచర్య నెఱుంగము.

సుమం——వత్సా! గట్టివాఁడవోయి; దర్పసౌజన్యములకుఁదగినట్లు మెలంగ నేర్తువు. ఇటువంటి నిన్ను మాన్నృపాలుఁ డైక్ష్వాకుఁడు రామభద్రుఁడు తిలకించెనేని వాత్సల్యముచేనతనిహృదయము కఱగిపోవును గదా?

లవు——ఆర్యా। ఆరాజర్షి సజ్జనుండని ప్రసిద్ధి(లజ్జించుచున్నట్లు) మేమైనను

శా॥ సత్రాలంబడఁగొట్టుపాటి యసదా ♦ చారంబు సైరింప మా
ధాత్రీనాథు నెవండు మెచ్చఁడు చరి ♦ త్రఖ్యాతు? నొంగాక యి
ట్లత్రాసంబుగ నశ్వరక్షకులు స ♦ య్యాటించు విశ్వంభర
క్షత్రాక్షేపకరప్రగల్భములఁదే ♦ జశ్శాలి సైరించునే ? ॥

చంద్ర— (చిఱునవ్వుతో)ఎట్లూ ! తండ్రిగారి ప్రతాపోత్కర్షమునఁ
గూడ నీ కసహానమా ?

లవు—అసహానముండనీ ఉండకపోనీ, ఒకమాట అడిగెదను చెప్పుము,
ఆరాఘవేంద్రుఁడు దాంతుండని వినుచున్నాము. స్వయముగ
నాయన గర్వితుండుగాఁడు ఆయన ప్రజలయందును గర్వముచూప
ట్టదు, కాని ఆయనసేవకులిట్లు రాక్షస వాక్కులాడుచున్నారేమి ?

గీ॥ మదవిగర్వితులాడు సం ♦ భాషణము నె
ఋషులు రాక్షసమని నిర్ణ ♦ యించినారు;
ఎట్టివైరంబునకును న ♦ దే పునాది
పరమదౌర్భాగ్యమదియె ప్ర ♦ పంచములకు ॥

ఈవిధముగా దాని నిందించుచుఁ దదన్యము నిట్లని యభినం
దించిరి.

గీ॥ కామితంబులనించు న ♦ ఘంబుఁ ద్రుంచుఁ
గీర్తి సంతానమును గాంచుఁ ♦ గీ డడంచు
జగములభరించుఁ గల్యాణి ♦ సత్యవాణి
జ్ఞానులు వచించెదరు కామ ♦ ధేనువనుచు॥

సుమం—ఈకుమారుఁడు పుట్టువుచేతనే పరిశుద్ధస్వభావుఁడు దానిపై
వాల్మీకిభగవానునిశిక్ష. ఇఁక నార్షసమ్మతమైన వచనముల నుపన్య
సించుటలో నాశ్చర్యమేమున్నది ?

లవు—చంద్రకేతూ ! "తండ్రిగారి ప్రతాపోత్కర్షయందుఁగూడనీకస
హానమా" అనిపల్కితివే, చెప్పుము. క్షాత్రధర్మమొక్కరిసొమ్మా

సుమం—బాలకా ! ఐక్ష్వాకుఁడైన దేవుని నెఱుంగవుగానిఊరకో, అతి ప్రసంగము వలదు.

ఆ॥ వె॥ సైనికులను గెల్చి ♦ చాటించినావు నీ
బిఱుదులాతనితనము ♦ సరియెకాని
పరశురాముభంగ ♦ పఱచిన జగజెట్టి
పోరిడ నిట్టు లట్టు ♦ లాడఁదగునె?॥

లవు—ఆర్యా, ఆరాజు భార్గవదమనుండని యేమో పెద్ద పొగడ్తగాఁ జాటించుచున్నారేమి ?

గీ॥ విప్రులకు వాణియం దొప్పు ♦ విక్రమంబు
క్షత్రియుల కొప్పు నదియె భు ♦ జంబునందు
భార్గవుఁడు విప్రుఁడై శస్త్ర ♦ పాణియయ్యె
నతని గెల్చిన తెనికే ♦ మంతగొప్ప ! ॥

చంద్ర—ఆర్యా ! అతిప్రసంగమెందులకు ? ఓ స్వామీ !

మ॥ ఇఁగనే మీరాతఁడు క్రొత్తఁగా వెలసినాఁ ♦ డే వీరుఁడిమ్మేదినిన్?
భగవంతుండగు జామదగ్న్యతలలో ♦ నందూఱిపోఁ గల్గువాఁ
డగునేకా! భువనైక పావన శర ♦ ణ్యశ్లోకులౌ తండ్రిగా
రి గరిష్ఠత్వమునే గణింపఁ డఁటె! యేఁటిఁ జీరికింగైకొనున్?

లవు—కుమారా ! ఆరఘునాథుల గరిష్ఠత్వముఁగూర్చి యెఱుంగనివాఁ డెవ్వఁడు ? ఆవిషయమై కొంత వక్కాణింప వలసినదియుఁ గలదు అయినను ఎందులకు?

ఉ॥ ఆనృపు లెంతవైనను మ ♦ హాత్ములు, పెద్దలు, గాన వారినే
మే ననరాదు, తాటకను ♦ నిట్టెవధించిన యట్టిసద్యశ
శ్శ్రీనిధు,లాఖరాజిని బి ♦ ఱిందికి మూఁడడుగుల్ గమించి, రా
వానకు వాలిఁ గూల్చిన ప్ర ♦ భావము లోకమెఱుంగునేకదా!

చంద్ర—ఔరా ? అతిక్రాంతమర్యాదుఁడవై తండ్రిగారినిగూడ నధిక్షేపించుచున్నావుగా? ఇఁక మాటలతోఁబనిలేదు.

లవు—అవును పోరాటమునకుఁ దగిన చోటికిఁబోదము రమ్ము.

(ఇరువురును దర్పముతో నిష్క్రమింతురు.)

(సుమంత్రుఁడు రథముతో వెంటఁబోవును.)

(ఇది షష్ఠాంక ము.)





శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఉత్తరరాఘవము.

## సప్తమాంకము.

(ఆకసమున)

శా॥ ఓహో ! వీరకిశోరులార! భువనాత్యుగ్రంబు లీమీ రణో
త్సాహంబుల్ విరమింపుఁ డింక భవదస్త్రజ్వాలికామాలికా
దాహభ్రాంతము లై స్ఫులింగముల వంతంబయ్యె మింటన్ గ్రహ
వ్యూహంబుల్ రవిబింబయుగ్మసమరంబుల్లోకము ల్గాల్పవే!

లవు—అహో! ఏమీ యీమేఘనిర్ఘోషము!

సుమం—కుమారా ? చంద్రకేతూ! శంబూకవధార్థమై యేగిన రఘు
నాథుఁ డీమార్గమున వచ్చుచున్నట్లున్నాఁడు.

(పిమ్మటఁ బుష్పకముపై శ్రీరామచంద్రుఁడు ప్రవేశించును)

రామ— (పుష్పక విమానమునుండి దిగి)

శా॥ రారమ్మోయి కుమార, శూరకులచంద్రా, చంద్రకేతూ ప్రియం
బారన్ గ్రుచ్చికవుంగలింపు నను వత్సా ! సారకర్పూర నీ
హారాసారసుధాభిషేకముల చాయన్ జల్లనౌ నీతను
స్వైరస్పర్శముచేత మామకమనస్తాపంబు చల్లాఱుతన్॥

వత్సా! దివ్యాస్త్రధరదేహునకు నీకుఁ గుశలమే కదా ?

చంద్ర—జనకా! అత్యద్భుతరణవ్యాపారుఁడును ప్రియదర్శనుండునునగు
నీలవుని చెలికారముచేఁ గుశలము. అవధరింపుఁడు ఈవీరప్రకాండుని

నాయనగారు నన్నుగాఁగాని అంతికమించిన ప్రేమతోఁ గాని లాలింపవలయునని నావిన్నపము.

లవు— (స్వగతము) ఈమహానుభావుఁడు నన్నుగూడఁగౌఁగిలించుకొనిన బాగుండును.

రాము—(లవుని నిరూపించి)సంతోషము నీచెలికాఁ డతిగంభీరాకారుఁ డుకల్యాణాత్మకుఁడు సుమా అహో!

చ॥ మనుప సమస్తలోకముల ♦ మై ధరియించిన యస్త్రవేదమో!
తనుప నజాండమెల్లఁ దను♦ధారణఁజేసిన క్షాత్రతేజమో!
గనియయినట్టి శక్తులని♦కాయమొ! కాయమొ సద్గుణాళికిఁ
కనులకు మూర్తమై తగు జ♦గచ్ఛయ పుణ్యఫలైకరాశియో!

లవు—(స్వగతము) అహో! ఈమహాపురుషుఁడు పుణ్యానుభావ దర్శను డు గదా. ఈరూపము ప్రకృష్టమైన ధర్మమునకు ఫలానురూపముగ నున్నది. భక్తిస్నేహ వైరాగ్యంబుల కేకాశ్రయాంబీమూర్తియే,అహో ఏమిది!

శా॥ వైరంబెల్ల నశించె శాంతరస ము♦ద్భాసించె, దోర్గర్వవి
స్తారం బస్తమయంబుగాంచె, విసయ♦స్వాంతంబు న న్వించె, న
య్యారె! యీపురుషాగ్రణిం గనఁ దదే♦కాయత్తమయ్యెన్ మనం
బౌరా !పుణ్యులు తీర్థముల్ బలె నమూ♦ల్యశ్రీప్రభావోన్నతుల్॥

రాము—(స్వగతము)ఏమిది, ఈతఁ డొక్కమాఱుగ నాకుదుఃఖశాంతి గావించుచున్నాఁడు. మఱి యేనిమిత్తముచేతనోకాని నాయంతరాత్మను ప్రేమార్ద్రము గావించుచున్నాఁడు. అయినను. స్నేహమునకు నిమిత్తమేమి ?

గీ॥ వస్తువులఁ గూర్చు నంతరు ♦ పాధి యేదో,
బహిరుపాధులచేత నే ♦ ర్పడదు ప్రేమ
ప్రొద్దుపొడువంగనే తమ్మి ♦ మొగ్గ విచ్చుఁ,
గలువ చెలికానిఁ గని చంద్ర ♦ శిల కఱంగు॥

లవు—చంద్రకేతూ! వీరెవరు?

చంద్ర—ప్రియవయస్యా! మానాయనగారే కదా.

లవు—"ప్రియవయస్యా" అని పిలిచితివిగాన నాకును వీరావరునవారే; కాని, మహానుభావులగు రామాయణకథాపూరుషులు నల్గురును నీకీవరుసవారే కదా; అందు వీరెవ్వరో చెప్పుము.

చంద్ర—పెద్దనాయనగారే వీరు.

లవు—(ఉల్లాసముతో) ఏమీ! రఘునాథుఁడే కా, సంతోషము. మహానుభావుని దర్శించితిని. నేఁడుసుప్రభాతము, (వినయకౌతుకములతోఁ, బరికించి) నాయనా! ప్రాచేతసాంతేవాసి లవుఁడు నమస్కరించుచున్నాఁడు.

రాము—ఆయుష్మంతుఁడా? రారమ్ము; (ప్రేమతోఁ గౌఁగిలించి) ఓయి కుమారా! ఇంకేటికి? అతివినయము వలదు; రమ్ము నన్ను గట్టిగాఁ గౌఁగిలించుకొమ్ము.

గీ॥ పాకమై విచ్చుతమ్మి లోఁ జేకువోలె
లలితమై నున్ననై మాంసలంబు నైన
నీదు మైతాఁకు నాకు నామోదమయ్యెఁ
జలువ వెన్నెలతో గంద మలఁదులీల ॥

లవు—(స్వగతము) వీరికి నాపై నింతటి నిస్తులక్రేమము. అజ్ఞానమున వీరికే నేను మహాపచారముఁ గావించితిని. కత్తిగట్టువంతటి దుర్యోగమునకు నేనే దొరకొంటిని. (ప్రకాశముగా) ఈలవుని యజ్ఞానమును నాయనగారు క్షమింపవలయును.

రాము—వత్సా! నీవు చేసిన యపరాధమేమున్నది?

చంద్ర—ఏమియులేదు. అశ్వరక్షకులు ప్రకటించిన నాయనగారిప్రతాపోత్కర్షమును విని, యించుక విక్రమించినాఁడు.

రాము—బాలకా! క్షాత్రమున కిది యలంకారమే కాదఁటోయీ?

శా॥ తేజశ్శాలి సహింపఁడెన్నఁడు పరో ♦ త్తేజం బదే వానికిన్
నైజంబై, కొనితెచ్చికోని కళగా ♦ నన్ జాల శోభించు ; వి
భ్రాజద్దీప్తుల వేఁడివేలుపు జ్వలిం♦పన్ సూర్యకాంతంబు స్వో
త్తేజంబున్ వెలిఁగ్రక్కుఁదాను బరిభూ♦తింగన్న చందంబునన్ ॥

చంద్రి—సౌజన్యమెట్లో పరాక్రమముగూడ నట్లే యీవీరునియందు శోభించును. చూడుఁడు ఈతఁడు ప్రయోగించిన జృంభకాస్త్రములతో మనసైన్యములు కదలమెదలనేరక యెట్లుపడియున్నవో,

రాము—వత్సా, లవా ! అస్త్రముపసంహరింపుము, చంద్రకేతూ ! నీవును నీబలంబుల నోదార్పుము.

లవు—నాయనగారియాజ్ఞననుసరించెదను (ధ్యానమునటించుచున్నాఁడు.)

చంద్రి—చిత్తము (విష్క్రమించును)

లవు—అస్త్రము శాంతంచినది.

రాము—వత్సా! బ్రహ్మాదులయిన తొల్లింటి మహానుభావు లనేకసహస్ర వర్షంబులు తపించి, నిజతపోమయ తేజోవిరాజమానములగు నీ యస్త్రరాజములను సృష్టించిరి. అట్టి యీమంత్రపారాయణోప నిషత్తును భగవానుఁడగు భృశాశ్వుఁడు తనకు వేనవేలువర్షంబులు శుశ్రూషగావించిన యంతేవాసియగు విశ్వామిత్రునకొసంగె. ఆమహానుభావుఁడు నాకుమాత్రమనుగ్రహించె. ఇది నీని సంప్రదాయము. మఱి నీకేసంప్రదాయమున సిద్ధించినవి ?

లవు-మాయుభయులకును, నీయస్త్రములు పుట్టువుతోనే సిద్ధించినవి.

రాము—(ఆలోచించి తనలో) ఏమో కాఁగూడదా! ఇది ప్రకృష్టమగు పుణ్యపరిపాకముచే లభించిన మహాప్రభావము కాఁబోలు ! (ప్రకాశముగా) కాని ఉభయార్థకమేమి ?

లవు—మే మిరువుర మన్నదమ్ములము, కవలము.

రాము—అట్లయిన రెండవ వాఁడెవ్వఁడు ?

(నేపథ్యమున) భాండాయనా, భాండాయనా!

శా॥ భూమీపాలుర సైన్యకోటికినిఁ ద ♦ మ్ముంగుఱ్ఱుకుఁ యుద్ధమం
చేమో యంటివి, మిత్రమా, యది నిజం♦బే చెప్పు మీనాఁటితో
నే ముల్లోకములం దధీశ్వరపదం బే ♦ మాయమాఁగాక ను
ద్దామక్షత్రజనాస్త్రశస్త్రముల మం ♦ టల్ నేఁడు చల్లాఱుతఁ॥

రాము—ఓహో! ఎవఁడీతఁడు ధ్వనిమాత్రముచేతనే నారొమ్ములు పులక
రింపఁజేయుచున్నాఁడు. అహో ఁడే కాఁబోలు! నిర్ఘోషమునకుఁ దగినట్లే
శరీరముగూడ నీలమేఘశ్యామల కోమలమై యున్నది.

లవు—ఆయనయే నా అన్నగారు కుశుఁడు.

రాము—వత్సా! యిచ్చటి కొకమాఱు రమ్మందువా ?

లవు—ఆలాగుననే.

కుశు — ప్రవేశించి అద్భుత హార్దధైర్యములతో ధనువాస్ఫాలించుచు)

మ॥ తొలినై వస్వతునుండి యేమనుకులేం ♦ ద్రుల్ శక్రరక్షార్థమై
ఖలరక్షోవనముల్ దహించిరి నిజ♦క్షాత్రాగ్నులం దామహో
త్ములతోనే రణమేని ధన్యమిది మ♦త్కోదండ, మోహో! పిచం
డిలబాణస్ఫురదుగ్రదీధితి శిఖా ♦ నీరాజిత జ్యాంకమై!

( అని వికటముగఁ బరిక్రమించును. )

రాము—(కుశునిఁగాంచి)అహో! ఈక్షత్రియ బాలకుని పౌరుషాతి
రేక మేమీ!

చ॥ కలుషమెఱుంగుచూపు త్రిజ♦గంబులసత్త్వబలంబులఁ దృణీ
కరణమొనర్పు, ధారుణిది ♦ గంబడు నాఁబడు ధీరయాన ము
ద్ధురముగ, బాలుఁడయ్యు గిరి ♦ తోసరితోడగు గౌరవంబునఁ
గురదురవచ్చెడిఁ దనువు ♦ తో సదువీరమొ లేక దర్పమో?

లవు— (కుశుని సమీపించి, ఆర్యా! జయము.

కుశ—తమ్ముఁడా ! ఏమోయుద్ధమనుచున్నా రేమిటోయీ?

లవు— అదియెంతపాటిగాని, గఱువతనంబుమాని వీరియెడలఁ దాము
వినయముననే వర్తింపవలయు.

కుశు—అదేల?

లవు—మహానుభావుఁడా రఘునాథుఁడే ఈయన. మనయందు స్నేహభావమే వహించియున్నాఁడు. మీ సమావేశమునకు వేఁడుక పడుచున్నాఁడు

కుశు—(ఊహించుకొని) ఏమీ! రామాయణకథానాయకుఁడగు బ్రహ్మాండనాయకుఁడా యీతఁడు?

లవు—అవును.

కుశు—ఆమహానుభావుని పుణ్యదర్శనము ప్రార్థనీయముకదా కాని మనము వారిసన్నిధానమున కేవిధముగఁ బోవలయునో?

లవు—గురుసన్నిధికిం బోలె నుపచారపూర్వకముగనే

కుశు—ఓయీ! అదెట్లు?

లవు—ఊర్మిలాదేవికొడుకు చంద్రకేతుఁడీతఁడు; ఉదారగుణసంపన్నుఁడు సజ్జనుఁడు నన్నుఁ బ్రియవయస్యునిగా నెంచి నెయ్యమున గారవించుచున్నాఁడు. కావున, ఆతనివరుసచే ధర్మానుసరణమున మనకుఁగూడ నీరాజర్షి నాయనగారే కదా.

కుశు—అట్లే కానీ రాజన్యునియందైనను వినయానుసరణము దోషము కాదు.

లవు—ఆర్యా! ఈమహాపురుషునిఁజూడుఁడు. గంభీరమైన వీరి యాకారప్రభావము లోకాతీతములగు వీరిసచ్చరితాతిశయములకుఁ దార్కాణముగ లేదా?

కుశు—(పరికించి)

శా॥ ఔరా, ప్రేమరసాత్మకంబయినయీయాకారమేమీ! త్రిలో
కారాధ్యంబిది; యీప్రసాదగుణమాహా! యేమనం, బావనం
బీరాజర్షి మహానుభావ; మిఁకనేమీ పాత్రమందే బళే!
శ్రీరామాయణకావ్యకర్త ప్రకటించెం జెట స్వీయవాగ్దేవతన్ ॥

తండ్రీ! ప్రాచేతసాంతేవాసి కుశుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

రాము—ఆయుష్మంతుఁడా, రా రమ్ము;

గీ॥ సజలజలదమనోహర♦శ్యామమగుచు
నిద్దమై ముద్దుగారెడు, నీదుమేను
గాఢవాత్సల్యమున బిగ్గ♦(గౌఁగిలింప
నాకు మనసయ్యె రాఁగదో♦యీ కుమార!

(కౌఁగిలించితనలో) ఈబాలకుఁ డెవ్వరి సంతానమోకాని,

శా॥ అంతర్నాడికలం దొలంగునిజదే♦హస్నేహసారంబొ, దృ
ష్టాంతాకారతఁ బైకినేర్పడిన దీ ♦ వ్యచ్ఛేతనాధాతువో,
భ్రాంతానందము చేతఁ బొంగుహృదయ♦స్రావంబొ, నాదేహమా
ద్యంతం బీతఁడు ముంచెఁగౌఁగిట సుధా♦యాదోనిధానంబున॥

లవు—జనకా! పట్టపగలింటిభానుఁడు నెన్నొసటిం దపించుచున్నాఁడు. ముహూర్తమాత్రి మీరమద్రిచెట్టునీడం గూర్చుందురుగాక.

రాము-వత్సా! నీయిష్టమే కావింతు (అందఱుపరిక్రమించికూర్చుందురు.)

రాము_(తనలో) ఈ కుశలవుల జన్మవృత్తాంతమం దేదో రహస్య ముండి తీరవలయును. ఈబాలకుల వినయపవర్తనమునందు సంయితము, నడుచుట, నిలుచుండుట, కూర్చుండుట మున్నగు స్వభావములలోఁ బ్రాజ్యములగు సామ్రాజ్యలక్షణములే గోచరించుచున్నయవి. ఇవి ప్రయత్నముతో నలవరించుకొన్నవిగాఁ గన్పించుటలేదు. నిర్మలినంబులగు జాతిరతనంబులయందు నిగనిగలాడు మయూఖమాలికలపోలిక, వికచారవిందములయందు మాకరందబిందువుల చందమున, బ్రతికలమనోహరములగు వీరి దేహములయందు సహజలక్ష్మీవిలాసములే తాండవించుచున్నవి. అయ్యో! నాపాడుహృదయ మింకను నిర్ణయింప నేరకున్నది గాని ఈ శిశుద్వయము నందురఘు కుమారుల చందములెన్ని ప్రతిబింబించుటలేదు?

సీ॥ తరుణకపోతకం♦ ఠచ్ఛాయతోరాయు మెఱుఁగారు నిద్దంపు ♦ మేనిచాయ
ఘనవృషస్కంధంబు ♦ నెనయు మూఁపులతోడ సమ పరిపీన గా ♦త్రములసొరు

ధీర ప్రశాంత గం ♦ భీర నిశ్చలమైన కోదమసింగంపు వే ♦ లుదుటుఁ జూపు
కణకణలాడు మం ♦ గళమృదంగధ్వనిం దలపించు కంచు కం ♦ ఠస్వరంబు
గీ॥ వెలయు వీరికి రఘుసమా ♦ రులసఁబోలె సూక్ష్మతరముగ మతిమతిఁ ♦ జూచుకొలఁది
జానకీలీల లెన్నియో ♦ కాన నగుచు కనులలో నాడుచున్న దా ♦ కలికిమోము॥

హృదయమా! ఇంకను సందేహించెదవేల? జానకీ వదనారవిందమే యీకవలమోములం దుట్టిపడుచున్నది,

గీ॥ అణిముత్యాల పలు కాంతి ♦ నందగించు
ముద్దుమోవి యదే; కర్ణ ♦ ములును నవియె;
రక్తనీలంబులయ్యు నే ♦ త్రములలోని
సహజ సౌభాగ్య గుణవి ♦ లాసంబు లవియె॥

ఇదియే వాల్మీకి నివసించునట్టి యరణ్యము. ఇక్కడనేకదా జానకి పరిత్యజింపఁబడినది. బాలకుల రూపలీలాదికములా సరిపోవు చున్నవి.ఇఁక "అస్త్రములు స్వతస్సిద్ధములు" అను విషయమేదో దానిని గదా విమర్శింపవలయు. ఆనాఁడు చిత్రసందర్శనసందర్భమునం దీయస్త్రములఁగూర్చి నా చేసిన వరప్రదానమేఫలించినదేమో? సంప్రదాయశూన్యముగఁ దొల్లింటి మహానుభావులకైనను నీ యస్త్రములు లభించినట్లు నేను వినలేదు. ఈయానందాతిశయమే సందేహములచే నాందోళించు నాడెందమును నమ్మించుచున్నది. ఇదియుంగాకఁ దేవేరి గర్భభారము రెండుపాయలుగా నేర్పడియుండుటను నేనెన్నిమాఱులో జూచితిని. పోనీ యేదేని యుపాయముచే వీరినడుగుదునా?

లవు—జనకా? ఏమిది జగన్మంగళంబగు మీవదనారవిందము బాష్పవర్షముచేఁ దోఁగుచున్నది; ఎందులకు?

కుశు—వత్సా! ఎందులకని యడిగెదవేమి?

మ॥ అనుఁగుంజానకిలేని రాములకుఁగా ♦ దా దుఃఖమేదేనిఁ, గాం
తనెఱంబాయఁ బ్రపంచమంతయును నర ♦ ణ్యంబేకదా? యంత య

త్యనురాగంబెటో యావియోగమటులే • యయ్యెం దురంతంబికే
మన; రామాయణమే యెఱుంగనటు వత్సా, యిట్లుప్రశ్నింతువే?

రాము—(స్వగతము) అహో! వీరి ప్రసంగము తటస్థముగానున్నది. వలదు. ఇంకఁ బ్రశ్నించి మాత్ర మేమిప్రయోజనము? ఓపాడు హృదయమా! ఆకస్మికచంచలవికారముతో నేల పరువులెత్తితివి? పట్టఁజాలని దుఃఖముచే బయటఁబడిపోయి పసివాండ్రు సైతము జాలిపడునంతటి బేలవై పోయితివి. కానీ, ఈవికారము కప్పిపుచ్చెదఁగాక. (ప్రకాశముగా) బాలకులారా! రామాయణ మఁట, అందుసూర్యవంశ సంకీర్తనముగలదఁట వాల్మీకిభగవానుని సరస్వతీనిష్యందమట! అందొక్కింత వినఁ గుతూహలమగుచున్నది, చదివెదరా?

కుశు—అవును ఆగ్రంథమును మేము శ్రద్ధతోఁ బఠించితిమి. అడిగిన వెంటనే, బాలచరిత్రాంతమాధ్యాయములోని యీ రెండు శ్లోకములు స్ఫురించినవి. ఆకర్ణింతురుగాక,

* శ్లో॥ ప్రియాతు సీతా రామస్య। దారాపితృకృతా ఇతి
గుణా ద్రూపగుణాచ్చాపి। ప్రీతి ర్భూయో ప్యవర్థత ॥

లవు—తండ్రీ! రెండవశ్లోకము నేను చదువుదునా?

రాము—నాయనా? ఏదీ పఠింపుము.

† శ్లో॥ తథైవ రామస్సీతాయాః। ప్రాణేభ్యోపి ప్రియో భవత్
హృదయన్త్వేవజానాతి। ప్రీతియోగం పరస్పరమ్ ॥

రాము—(స్వగతము) హా! హా! కష్టము. ఇది యతిఘోరముగ హృదయమర్మమును జెల్లగించుచున్నది. హా దేవి! అప్పుడీప్రకార

---

* గీ॥ మున్నె యనురక్తురాలు గా • మునకుసీత। తండ్రిగాెంచికూర్చిన • దారయగుట
నా మెయాయనురక్తి పెం • పందఁజేసె। గుణగణముచేత మఱిరూప • గుణముచేత॥

† గీ॥ అట్టులే రాముఁడును జన • కాత్మసుతకు। ప్రాణములకంటెఁబ్రియతరుం • డైరహించె
నొండొరులకున్న యా ప్రీతి • యోజనంబు। లెట్టివో వారిమానస • మే యెఱుంగు ॥

ముననేకదా మనకు జరిగినది. అట్టి యీ సంసారవృత్తాంతము లేయేనాటికంతములేని విపర్యాసపరంపరలతో విప్రలంభాంతములుగాఁ బరిణమించి హృదయమును దహించుచున్న వే.

సీ|| పరమవిశ్వాసభా ♦ వములచే మితిలేని నాఁటి యానంద సం ♦ దర్భమేడ
అన్యోన్యనర్మ లీ ♦ లానుకూలవిధాన నానావిలాస య ♦ త్నంబులేడ
తనివోని కూర్మి మం ♦ తనపు ముచ్చటలకై యొదవు కౌతుక రసా ♦ భ్యుదయమేడ
ఖేదమోదముల నే ♦ కీభావము వహించి పెనఁగొన్న మనసు పొం ♦ తనము లేడ
గీ|| అంతయు నదేదొ స్వప్న వృం ♦ త్తాంతమట్లు ముగిసి దుస్స్మరణీయమై ♦ పోయెఁగాని
పాడుప్రాణంబు లేటికో ♦ పాసిపోక ప్రాఁపలాడుచున్న వి ♦ పాపిబొందిII

హా! హా! దుర్భరము, దుర్భరము దుస్స్మరణీయమైన యీకాలమేయిప్పుడు స్మరింపనయ్యెనా?

కుశు—ఇంకొకటి చదివెదను. మందాకినీ చిత్రకూటవిహార సమయమున రఘునాధుఁడు సీతాదేవిం గూర్చి పలికిన శ్లోకమిది.

* శ్లో|| త్వదర్థమివవిన్యస్తశిలాపట్టో௨యమగ్రతః
యస్యాయమభితఃపుష్పైః ప్రవృష్టఇవ కేసరః '

రాము—(సలజ్జాస్మిత స్నేహకరుణముగా) పసివాండ్రు చాలబేలలు. విశేషించి యరణ్యసంచారులు- హా దేవీ! దండకారణ్యావాసప్రియసఖీ!

(కొందరు వటువులు పరువెత్తి వత్తురు)

వటు—కుమారులారా! మీకును, రాజపుత్త్రసైన్యములకును ఘోరయుద్ధము జరుగుచున్నదని మన మునిపల్లె యీబాలగోపాలము కలగుండువడి పరువెత్తికొని వచ్చుచున్నది. అందులో మన గురువుగారగు వాల్మీకులును వసిష్ఠులును మఱి మిథిలాపతియగు వృద్ధరాజర్షియు, అరుంధతీ సహితులై కౌసల్యాదులగు 'దశరథుని పట్టపు

* గీ|| నీకొఱకమర్చియుంచి న ♦ ట్లోకనలరు । నీశిలావేదికనుజూడు ♦ మెట్టయెదుట
పఱపుగానున్నయఃకిసీని ♦ పైనబూలు । వానగురిసినదేమొయీ ♦ వకుళతరువు||

దేవులును బయలుదేఱి ముదుసలితనముచే నడువలేక పడుచు లేచుచు వచ్చుచున్నారు.

రాము——ఏమీ! పూజ్యులగు నరుంధతీవసిష్ఠులును నమ్మలును, మామగారుగూడ నిక్కడనేయున్నారా? అయ్యో! వీరందఱి నే నేమొగమునఁజూతును. హా హా మంద భాగ్యుఁడను, జనక రాజర్షి గూడ నిచ్చటికేవచ్చినాఁడని పిడుగువంటివార్తవింటినే! హా జనకా! హా తల్లులారా! జనకరఘువంశముల రెంటికిని యే సాధ్వీతిలకంబు సమస్త కల్యాణముల కాస్పదమో అట్టిపావనిఁబొడసైతము దయమాలిన కఠినాత్ముఁడను నాయందు మీరుకరుణచూపవలదు. (ప్రకాశముగా) కుమారులారా! మనమే త్వరగఁబోయి వారిని సేవింతము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది సప్తమాంకము.





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఉత్తరరాఘవము.

## —♦ అష్టమాంకము ♦—

( ప్రవేశము :— లక్ష్మణుఁడు. )

ఓహో! ఇప్పుడు వాల్మీకిభగవానుఁడు బ్రహ్మక్షత్రపౌర జానపదులగు ప్రజలతోఁ బాటుమమ్ముఁగూడనాహ్వానముగావించి, స్వప్రభావముచే దేవాసురతిర్యగురగమానవనికాయ్యంబగు చరాచరభూతప్రపంచము నొక్కయెడ సమావేశపఱచినాఁడు. నాకును అన్నగారాజ్ఞాపించిరికదా "వత్సా! తన నాటకమప్సరస్త్రీ లాడుచుండగాఁజూచుటకు వాల్మీకిభగవానుఁడు మనల నాహ్వానముగావించెఁ గావునభాగీరథీ తీరమందలి యొక మనోజ్ఞస్థానమున సమాజసన్నివేశము గావింపుము" అని;ఆలాగే నేనును,మర్త్యామర్త్యవిశిష్టమగుభూతసంఘాతమునకు నుచితస్థానంబులఁగల్పించితిని. ఇదిగో ఆర్యుఁడును దయచేయుచున్నాఁడు. ప్రాజ్యమగు రాజ్యాశ్రమమునందుండియు దుష్కరమగు తాపసవ్రతమునే యవలంబించుచున్న యన్నగారు వాల్మీకిభగవానుని యందలి గౌరవముచేతనే యిక్కడికి కేతెంచుచున్నారు.

(పిమ్మట రాముఁడు ప్రవేశించును.)

రాము—వత్సా! లక్ష్మణా! రంగప్రేక్షకులు వచ్చినారా?

లక్ష్మ—వచ్చినారు.

రాము—ఈకుశలవకుమారుల కిరువురకును జంద్రకేతునితో సమానమగు స్థానమర్యాద నేర్పఱపుము.

లక్ష్మ—ప్రభుస్నేహము గుర్తించి యత్లే చేసితిని. ఇదియే రాజాసనము పఱపించితిని. ఆర్యుఁ డలంకరించుఁగాక. (రాముఁడు కూర్చుండును.)

లక్ష్మ—ఓయీ! ఇఁక నారంభింపుఁడు.

సూత్రధారుఁడు-(ప్రవేశించి) భూతార్థవాదియగు వాల్మీకిభగవానుఁడు, జంగమస్థావర విశిష్టంబగు లోకంబునకిట్లని యాజ్ఞాపించుచున్నాఁడు "ఆర్షనేత్రముతోనుపలక్షించి, పావనంబును కరుణాద్భుతరసబంధురమునుగా మేము నిబంధించిన యీ ప్రబంధమును, గార్యగౌరవముచే నవధరింతురుగాక" అని.

రాము—ఇట్లని వేఱే చెప్పనక్కఱలేదు. మహర్షులు సమస్తధర్మములను బ్రతీక్షించినవారు. అమృతసారంబులై, పరోరజసంబులగు వారి ప్రజ్ఞానంబులకు నన్యథాత్వం బెన్నండును సంభవింపదు. కావున నట్టివానియెడ సంశయింపనే కూడదు.

(నేపథ్యమున) హా! ఆర్యపుత్త్రా! హా! కుమారలక్ష్మణా! ఏకాకినిగా నీ మందభాగ్యురాలినిఁ గీకారణ్యమున దిక్కులేనిదానిగా విడిచిపెట్టితిరే! ఆసన్నప్రసవవేదనతో నల్లాడు నన్నీ గంగకే యొప్పగింపనెంచితిరా?

లక్ష్మ--(స్వగతము) అయ్యో! ఇదేదో విపరీతమైనదే!

సూత్ర—

గీ॥ దేవి వైదేహి విశ్వధా ♦ త్రీతనూజ
విభునిచేఁ గాఱుఁగాన ల ♦ విడువఁబడియె
పతివియోగార్తిచే నామె ♦ ప్రసవబాధ
నోపజాలక గంగలో ♦ నుఱుకఁబోయె.

(నిష్క్రమించును.)

రాము—హా! హా! దేవీ జానకీ! సాహసింపకుము, సాహసింపకుము. వత్సా, లక్ష్మణా! రక్షింపుము. రక్షింపుము.

లక్ష్మ—ఆర్యా! యిది నాటకము.

రాము—హా! దేవి, దండకారణ్యావాస ప్రియసఖీ ! నీకీదైవదుర్విపాక మంతయు నీరామహతకుని వలనఁగదా.

లక్ష్మ—ఆర్యా, ప్రబంధార్థమును దిలకింపుఁడు.

రాము—ఇదే వజ్రమయుఁడను సిద్ధముగానేయున్నాను.

(అంతటఁదొడపైనొక్కొక్క బాలకునుంచికొన్న పృథ్వీభాగీరథులచే నవలంబింపఁబడిన సీత ప్రవేశించును.)

రాము—వత్సా ! సౌమిత్రీ, యేమో నిర్ణయింపరాని మహాంధకారమునఁబడిపోవుచున్నాను సుమా నాచేయిపట్టుకొమ్మి.

పృథ్వీ భాగీరథులు—

గీ॥ ఊఱడిలుమమ్మ కల్యాణి ♦ యూఱడిల్లు
అమ్మ వైదేహి నీయదృ ♦ ష్టమ్ము పండె
రఘుకులము నింపుమేటి పు ♦ త్త్రకుల గవల
కడుపుచల్లంగఁ గంటివి ♦ గా కుమారి!

సీత (చూచి)ఆహా ! ఇద్దఱుకొడుకులఁగంటినా ? ఏరీ (పిల్లలనంటికొని)! హా ! ఆర్యపుత్త్రా, (మూర్ఛిల్లును)

లక్ష్మ-(రాముపాదములపైఁబడి)ఆర్యా! అదృష్టవంతులము, బ్రతికితిమి రఘువంశమునకుఁగల్యాణాంకురములుదయించినవి, (రాముంజూచి) హా, హా ! ఏమిది కన్నీటిమున్నీటంబడి, పరవశుఁడై యార్యుఁడు మూర్ఛిల్లెఁగదా, (విసరుచున్నాఁడు)

పృథ్వీ—బిడ్డా,: ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

సీత—భగవతులారా, మీరెవ్వరు ?

పృథ్వీ—వత్సా ! ఈమె నీశ్వశురకులదేవత భాగీరథి.

సీత—భగవతీ ! నీకు నమస్కారము,

భాగీ—చారిత్రమున కనురూపమైన కల్యాణపరంపరలం బొందుము.

లక్ష్మ—అమ్మ ! అనుగ్రహింపఁబడితిమి.

భాగీ—వత్సా, ఈయమ నీ తల్లి వసుంధర.

సీత—హా! అమ్మా, ఇట్టియవస్థలోనున్న నన్ను జూచుచున్నావా ?

పృథ్వి—రావే నాతల్లీ, రమ్మా. (సీతను కౌఁగిలించి మూర్ఛిల్లును.)

లక్ష్మ—అమ్మయ్య ! ఆర్య పృథ్వీభాగీరథులచే నను గ్రహింపఁబడినది.

రాము—(చూచి) ఇది మఱింత కరుణాస్పదముగానున్నది.

భా—విశ్వంభరయు దుఃఖంచుచున్నదే ! కన్నకడుపుకదా దీని కెంతటివారైనలోఁగిపోవలసినదే. చైతన్యవంతులకెల్లనీసంసారతంతు వంతరంగమున మోహగ్రంధితోఁ బెగిపోకుండ నుండునదే కదా. వత్సా! వైదేహీ, దేవి భూతధాత్రీ, ఊఱడిల్లుఁడు ఊఱడిల్లుఁడు.

పృథ్వి—భాగీరథీదేవీ! ఈసీతనుజూచి నే నూఱడిల్లుటయెట్లు?

మ॥ కలకాలంబిటుబిడ్డ కాఁపురమయో ♦ కష్టాలతోనే చనన్
వలెనా! యింతసుఖంబుమాటఁ గలనై ♦ నంగాన దాలంకలో
పల రాకాసిచెఱం జిరంబునికి చ ♦ ప్పన్ వెండి, నీరాడు ప్రొ
ద్దులలో నీగతి సంభవించె నెటులో ♦ దుఃఖం జూచి యీ కానుపున్॥

భాగీ—దేవి. తెలియనిదానవుకావు గదా భవితవ్యమున కెవ్వరడ్డు పడఁగలరు ?

పృథ్వి—భాగీరథీ, నిజమే కాని రామభద్రునకిది తగినపనియా? చూడు

మ॥ మునుబాల్యంబునఁ దా గ్రహించిన కరం♦బున్ లెక్క సేయండు,మ
న్నన నన్నైనగణింపఁ డా జనకునై ♦నం గానఁ డా వహ్నినై
నను గైకోఁ డలసాహచర్యమతినై ♦నం జూడఁ డీ కాన్పునై
న నిదానింపఁడిఁ కేవియో తగుప్రమా,ణంబుల్ ధరాజానికిన్

సీత—హా! ఆర్యపుత్త్రుఁడు తలంపునకుఁ దేఁబడియెనే!

పృథ్వి—ఆఁ ఇంకను నీ కార్యపుత్త్రుఁ డెవ్వఁడే?

సీత—(సిగ్గుతోడి కన్నీటితో) అమ్మా నీ వన్నట్టె.

రాము—అమ్మా ! పృథ్వి నిజమే. ఉన్నను నేను లేనివాఁడనే.

భాగీ—భగవతీ, వసుంధరా! క్షమింపుము. ఈసంసారమునకు శరీరంబవే నీవుకదా, ఎఱుకలేనిదానివలె నల్లునిపైఁ గోపగించుకొందువేమీ?

మ॥ అలమెన్ దుర్యశమెల్లలోకముల నా ♦ యానోట, మున్ లంకలో
పలఁగావించిన శుద్ధిమాట యొకఁడున్ ♦ బాటింపఁడిచ్చోట, నీ
యిల, లోకానుమతంబెకా కులధనం ♦ బిక్ష్వాకువంశ్యాళికిన్
కలఁతం జిక్కిన రామభద్రునకిఁకం ♦ గర్తవ్యమేముండెడిన్?

లక్ష్మ—దేవతల కడ్డేమున్నది నిఖిలభూతహృదయేంగితంబుల నెఱుఁగ నేర్తురుకదా. అందున భాగీరథింగూర్చి చెప్పవలయునా? తల్లీ నిజమాడితివి, నీకిదే యభివాదనము.

రాము—తల్లీ! భగీరథకుటుంబమందు నీకుఁ గలయనుగ్రహమును నిర్వర్తించితివి.

పృథ్వి—భాగీరథీ! మీయెడనిరంతరమునేను ప్రసన్నురాలనే అయినను నాబిడ్డకు సంభవించిన యీదుఃఖసంవేగమాపాతదుస్సహమైనది. రామభద్రునకుసీతపైఁ గలగాఢానురాగము నేనుమాత్ర మెఱుంగనా

గీ॥ విధివశంబునఁ బ్రియురాలి ♦ విడిచియతఁడు
దరికొని దహించుచున్న డెం ♦ దంబుతోడ
నఖిలలోకోత్తరాతిధై ♦ ర్యంబువలన
బ్రతికియున్నాఁడు ప్రజలసౌ ♦ భాగ్యమునను॥

సీత—(ఏడ్చుచుఁగృతాంజలియై) తల్లీ, ఈదుఃఖముభరించి నేనింకబ్రతుక లేను, నీయంగములయందు నన్నువిలయము గావింపుము.

రాము—ఇంతకంటె వేఱేమనఁ గలదు!

భాగీ—పాపము శాంతించుఁగాక. బిడ్డా, వేయివత్సరములు సౌభాగ్యవతివై జీవించియుండుము.

పృథ్వి—వత్సా! సాహసమువలదు. నీపుత్త్రకులనైన గాపాడకొనవా?

సీత—అమ్మా, అనాథనైపోయితిని. ఇంకవీరితోనేమి?

రాము—హా! హృదయమా! వజ్రమయమైతివే!

భాగీ—బిడ్డా, నీవు సనాథవే అనాథవెట్లవుదువు?

సీత—అయ్యో! మందభాగ్యురాలికి నాకు సనాథత గూడనా.

భాగీ—వత్సా, ఏల నిర్వేదము?

గీ॥ అమ్మరో, లోకకళ్యాణ ♦ మైన నిన్ను
నీవె యీగతినేలనిం ♦ దించుకొందు
నీదుసాంగత్యమునఁజేసి ♦ నిశ్చయముగ
మాపవిత్రతగూడసం ♦ భావ్యమయ్యె

లక్ష్మ—ఆర్యా! వినుము.

రాము—శోకము వినుఁగాక.

(నేపథ్యమునఁ గలకలము.)

రాము—ఇదేదో మహాశ్చర్యతరమైనదే!

సీత—ఆహా! ఏమిది అంతరిక్షమంతయుఁ బ్రజ్వలించుచున్నది!

పృ-భా—ఓహో! తెలిసినది.

గీ॥ మున్ను క్రమముగ నల భృశా♦శ్వుండు, కౌశి
కుండు, రాముండు వేనికి♦గురువులైరి,
అవియె యావిర్భవించుచు♦న్నవి నిశాత
మార్గణగణంబుతోడి జృం♦భకములెల్ల॥

(నే ప థ్య ము న)

గీ॥ జానకీదేవి, యిదెనమ ♦ స్కారమమ్మ
శరణమింకమాకునీతనూ ♦ జద్వయంబె
చిత్రపటమందుమమ్ము ద ♦ ర్శించునప్పు
డల్లరఘునాథుఁడీకిట్లు ♦ యానతిచ్చె॥

సీత—ఆహా! ఆనందము. అస్త్రదేవతలు ప్రస్ఫురించుచున్నారు.

లక్ష్మ—ఆర్యా, ఆనాఁడు వక్కాణించితిరిగదా, "సర్వథా యివినీ సంతానము నాశ్రయింపఁగలవు" అని.

పృ-భా—గీ॥ వందనంబో మహో(స్త్రు)దై ♦ వతములార,
ధన్యులము మేము మీ ప్రసా ♦ దంబు వలన
బిడ్డ లెప్పుడు మిమ్ముభా ♦ వింతు రపుడు
దరికి నరుదెంచు పొందు భ ♦ ద్రమగు మీకు ॥

రాము—వత్సా ! లక్ష్మణా !

గీ॥ విస్మయానందసందర్భ ♦ విభ్రమములఁ
జెదరి యుప్పొంగు కరుణవీ ♦ చికల సుడిసి
ఇట్టిదట్టిదియని నిర్ణ♦యింపరాని
కొండొకయవస్థలోఁ గొట్టు ♦ కొనుచుచుంటి ॥

పృ - భా—బిడ్డా ఆనందింపుము. నీపుత్త్రకు లిప్పుడు రామభద్రులంతటి వారైరి.

సీత—హా ! భగవతులారా ! దిక్కులేనిదాననైతికదా. వీరికి క్షాత్ర సంస్కార మొనరించువా రెవ్వరు ?

రాము—హా, హా, లక్ష్మణా ! ఎంతటి వైపరీత్యమయ్యెను.

మ॥ పరమేష్ఠిప్రతిమా వశిష్ఠుఁడు పర ♦ బ్రహ్మర్షి పారంపరిన్
బరిపాలించు రఘుక్షితీశ్వర కుటుం ♦ బంబంతకున్ దీపికా
భరణంబైన వసుంధరాసుత తపిం ♦ పంజొచ్చె సంస్కర్తలె
వ్వరునాబిడ్డలకంచు నీవిషమదై ♦ వప్రాప్తికిం కేమనన్ ॥

బాగీ—బిడ్డా ! దీనికై విచారమెందులకు ? కష్టకాలమున నిన్నాదరించి తనయాశ్రమమునఁ జేర్చుకొన్న వాల్మీకిభగవానుఁడు లేఁడా? ఆమహానుభావుండేకదా నీకుఁబురుడువోయుటకు మమ్ము నియోగించినది ; పాలువిడిచిన వెనుక నీ బిడ్డల నాయనకే యొప్పగించెదము. కావలసిన క్షాత్రసంస్కారమాయనయే నిర్వర్తింప గలఁడు. వశిష్ఠాంగిరసులెట్లో ఈవాల్మీకిభగవానుఁడు నయిత మట్లే రఘు జనక వంశముల రెంటికిని యాచార్యుఁడే.

రాము—ఏమీ! ఇదంతయు వాల్మీకిమహానుభావుని నియోగమా ? మహర్షీ! నమస్కారము. నీశిష్యవాత్సల్యమునిరూఢమైనది. అమ్మా భాగీరథీ, నీవును బాగుగ యోజించినావు.

లక్ష్మ—ఆర్యా, సత్యమువిన్నవించుకొనుచున్నాను. ఆ యీ జాడలం బట్టియీ బాలకులే కుశలవులని యూహించెదను. చూడుఁడు,

గీ॥ కవలు వీరలు వీరవుం ♦ గవులు, మఱియు
సత్రసంతతియా జన్మ ♦ మందె యొదవె
చదువులా మాని వాల్మీకి ♦ సంతరించె
పదియురెండేండ్ల ప్రాయపుం ♦ బడియుఁ గుదిరె॥

రాము—అవును, ఈశిశువులే కుశలవులని యాందోళించుడెందముతో నేనును కలవరమందుచునే యున్నాను.

పృథ్వి—బిడ్డా, ఇంకరమ్ము రసాతలమును బవిత్రీకరింపుము.

రాము—హా! ప్రేయసీ! లోకాంతరమునకుఁ దరలుచుంటివా ?

సీత—అమ్మా; నన్ను నీలోఁ జేర్చికొని లయమొందింపుము. ఇటువంటి జీవలోకపరివర్తన మింక నే ననుభవింపఁజాలను.

రాము—హా! హా! ఏమి ప్రత్యుత్తరము వచ్చినోకదా !

పృథ్వి—బిడ్డా, పాలు విడుచువఱకు నీవు నా కడుపున నుండి బిడ్డలఁ గాపాడుకొనుచుండుము, పిదప వాల్మీకి నియోగ మెట్లో యట్లు కావింతువుగాని రమ్ము.

భాగీ—ఈమాట బాగున్నది. వాల్మీకి యానతియు నిట్లేకదా.

(గంగా, పృథ్వీ, సీతలు నిష్క్రమింతురు.)

రాము—ఏమీ! వైదేహికి విలయమే సంభవించెనా? హా, దేవీ దండకారణ్యవాసప్రియసఖీ, హాచారిత్రదేవతా! లోకాంతమునకేగితివా ?

(మూర్ఛిల్లును.)

లక్ష్మ—హా, హా, వాల్మీకిభగవానుఁడా, రక్షింపుము, రక్షింపుము. ఇదియా నీకావ్యార్థము !

(నేపథ్యమున) చాలింపుఁడువాద్యములసందడి, ఓహోహో జంగమస్థావర మర్త్యామర్త్యభూతసంఘాతములారా ! వాల్మీకిభగవానునిచే ననుజ్ఞాతమైన పవిత్రాద్భుతమును బరికింపుఁడు.

లక్ష్మ—అహో ! అద్భుతముగానున్నదే

గీ॥ కలఁగెమథియించిన విధాన ♦ గాంగజలము
గగనతలమెల్ల దేవర్షి ♦ గణము నిండె
అద్భుతంబదె ! యార్య తో ♦ యములనుండి
వెడలె గంగా వసుంధరల్ ♦ వెంబడింప॥

( మ ఱి ల నే ప థ్య ము న )

మ॥ అరుదేవమ్మ యరుంధతీ, భువనవం ♦ ద్యా, మేము మందాకినీ
ధరణీదేవుల మప్పగించెదము నీ ♦ తఁ నీకుఁ బుణ్యాంగనా
భరణంబుఁ బతిదేవతాతిలకముఁ ♦ వైదేహి నీ కోడలిన్
గరణీయంబుదలంచి ప్రోచికొనుఁడిం ♦ కఁ నీవు వాల్మీకియుఁ॥

లక్ష్మ—ఆశ్చర్యమాశ్చర్యము. ఆర్యా చూడుఁడు; చూడుఁడు,
(పిమ్మట అరుంధతి, సీతయు, వాల్మీకియుఁ బ్రవేశింతురు)

అరుంధతి—గీ॥ త్వరపడుము వత్స, జానకీ ! ♦ త్వరవహింపు
ఆసగొనియిపు నెనువెన్క ♦ లాడఁదగదు
ప్రణయహితమైన నీ కర ♦ స్పర్శచేత
రమ్ము బ్రతికింపు వేగ మా ♦ రామభద్రు॥

సీత—(తత్తఱపాటున సమీపించి రాముని స్పృశించుచు)ఆర్యపుత్రా, ఊఱడిల్లుఁడు.

రాము—(సమాశ్వాసిల్లి యానందమున) అహో, ఏమది. (చూచి హర్షాద్భుతములతో) దేవియు, అరుంధతియు ఋష్యశృంగశాంతా సమేతులు గురువులందఱునా ?

అరు—వత్సా ! రామభద్రా, చూడుము. ఈయమ భగీరథకులదేవతయగు భాగీరథి, ఈమె నీ యత్తగారు భగవతి విశ్వంభర. సీమొదననుగ్రహించినారు.

భాగీ-పృథ్వి—(నేపథ్యమున) జగత్పతీ! రామభద్రా! పరిత్యాగ సమయమున మమ్ము ధ్యానించి సీతనుమాకొప్పగించితివిగదా ఆ ఋణము తీర్చికొంటిమి.

రాము—ఏమిది మహాపరాధుఁడనగు నన్ను భగవతు లిరువురు నను గ్రహించినారు!

అరుం—ఓహో! పౌరజానపదులారా! ఈవిధముగా నీమె, పూజ్యు లగు మందాకినీవసుంధరాదేవులచేఁ బ్రస్తుతింపఁబడి, వాల్మీకి మహాసీంద్రుచేఁ బరామర్శింపఁబడి యరుంధతినగు నాకు నొప్పగింపఁ బడుటయే కాక, పూర్వము భగవానుఁడగు వీతిహోత్రునిచే బ్రహ్మాదిదేవతలెల్ల నభినందింపఁ బవిత్రచారిత్రయని నిర్ణయింపఁబడి నది. అట్టి సూర్యవంశపుంగోడలగు దేవయజనసంభూతను నీ సీతను రామభద్రుఁడు మఱలఁ బరిగ్రహించుటకు మీాయభిప్రాయమేమి?

(నేపథ్యమున) ఇంతకంటె జగదానంద మేముున్నది? అవశ్యము పరిగ్రహించుఁగాక!

లక్ష్మ—ఆహా! ఎంతటి సుదినమిది!

(ఈవిధముగాఁ బూజ్యురాలగు నరుంధతీదేవి హెచ్చరించిన తోడనే పౌరజానపదులెల్లరును సమస్తభూతగ్రామంబును జానకీదేవికి నమస్కరించుచున్నారు. దిక్పాలురును సప్తర్షులును గుసుమవర్షముల నభిషేకించుచున్నారు.)

వాల్మీ—జగత్పతీ! రామభద్రా?

మ॥ క్రతురాజంబు యథావిధిన్ జరుగు లో • కశ్లాఘ్యమై, కాంచన
ప్రతిమాస్థానమునందు నిల్పికొను మ • ప్పా? నిక్కపుంజానకిన్
గృతపుణ్యన్ సహధర్మచారిణిఁ బురం • ధ్రీరత్నమున్; బుణ్యదం
పతులన్ మిమ్ములఁ గన్నులారఁగని యా • నందించు ముల్లోకముల్॥

రాము—భగవానుఁ డాజ్ఞాపించినట్లు

లక్ష్మ—నేఁటికిఁ గృతార్థుఁడనైతిని

సీత—అమ్మయ్య, బ్రతికితిని,

లక్ష్మ-అమ్మాజానకీ !లజ్జాహీనుఁడు లక్ష్మణుఁడునమస్కరించుచున్నాఁడు
సీత—వత్సా! ఇట్టివాఁడవుగానే చిరకాలము వర్ధిల్లుము!
అరుం—వాల్మీకిభగవానుఁడా! సీతాగర్భసంభూతులగు రామభద్ర
పుత్రకులఁ గుశలవులఁ గూడఁ దలిదండ్రుల కప్పగింపుము.
రాము—లక్ష్మ—ఆనందము, కానిండు.
సీత—(సబాష్పాకూతముగ)ఏరీ నాపుత్త్రికులు!
వాల్మీ—బిడ్డలారా!రండు నమస్కరింపుఁడు. ఈయన మీతండ్రిరఘు
పతి. ఈతఁడు మీ పినతండ్రి లక్ష్మణుఁడు ఈమెయే మీతల్లి సీతా
దేవి. ఈమహానుభావుఁడు మీమాతామహుఁడు జనకరాజర్షి.
సీత—(హర్షకరుణాద్భుతములతోఁ జూచి) ఏమి నా తండ్రియా?
కుశ—లవ—హా! తండ్రీ! హా! తల్లీ! హా! మాతామహా!
రాము-(సంతసమునఁగౌఁగిలించి) కుమారులారా!పున్నెమునలభించితిరి.
సీత—కుమారా కుశా! రా, రమ్ము కుమారా లవా! రా నాయనా?
జన్మాంతర గతను నన్నుఁ జిరకాలము కౌఁగిలించుకో,
కుశ—లవ—ఆహా! ధన్యుల మైతిమి.
సీత—వాల్మీకిభగవానుఁడా! నమస్కరించుచున్నాను.
వాల్మీ—బిడ్డా! చిరకాలము సౌభాగ్యవతివై వర్ధిల్లుము.
సీత-ఆహా!ఎంతటిసుదినమిది'నాయనయుఁ, గులగురువులును,ఆర్యాజనం
బును, సభర్తృకయగు శాంతాదేవియు సలక్ష్మణుఁడై సుప్రసన్నుఁ
డైన యార్యపుత్త్రుఁడును గుశలవులునునొక్కమాఱుగఁగనిపించు
చున్నారు. అహో! ఈమహానందమునఁ బరవశనగుచున్నాను.
వాల్మీకి—రామభద్రా! నీ కింక నేమికావలయు?

## —♦ భరతవాక్యము ♦—

కలుషంబుల్ దొలఁగించి యీ కథ జగ ♦త్కల్యాణియై మేలు వ
ర్ధిలఁ జేకూఱుచుఁగాక లోకజనయు ♦క్తిజ్ఞ జాహ్నవింబోలి, ని
చ్చలు వాగ్బ్రహ్మకవిప్రరూఢమగు ప్ర ♦ జ్ఞావాణి నీ రూపకం
బిల సేవింతురుగాక రంగములయం ♦దింపార విద్వన్మణుల్ ॥